

# భారతి

వ్యవస్థాపకులు
దేశోద్ధారక నాగేశ్వరరావుపంతులు

నవంబర్ 1975

వెల: రూపాయిన్నర

# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

*

నవంబరు 1975

సంపుటము : 52 : సంచిక : 11 :

విడిపత్రిక వెల రూపాయిన్నర

# సమస్యల వలయంలో నుంచి
# సమసమాజ చతురస్రంలోకి...

కొందరి జీవితం వడ్డించిన విస్తరి
అట్టివారు బహు కొద్దిమంది
కాని, అత్యధిక సంఖ్యాకుల జీవితం
నిరంతర సమస్యల సంఘర్షణ వలయం
ఆ వలయం నుంచి వారికి విముక్తి కలిగించాలన్నదే
అందుకే...... ప్రభుత్వ సంకల్పం

* చదువుకోదలచిన వారికి స్కాలర్‌షిప్పులు
* ఉద్యోగాలలో రిజర్వేషన్లు
* హాస్టళ్లలో ఉచిత భోజన వసతి సౌకర్యాలు
* శాసనసభల్లో ప్రత్యేక సీట్ల సౌలభ్యాలు
* భూమిలేని పేదలకు బంజర్ల పంపిణీ
* ఇళ్లు లేని దీనులకు స్థలాల పంపిణీ
* ఆర్థిక సహాయ సంస్థలద్వారా ఋణాల కల్పన

అంతేకాక యింకా అనేక చర్యలు—
సమసమాజ నిర్మాణానికి వేస్తున్న దారులు
ఎన్నో ఎన్నో వున్నాయి
బలహీన వర్గాలవారికి ఆశాజ్యోతులై నిలిచి వున్నాయి

సమాచార, పౌర సంబంధశాఖ, హైదరాబాదు. నెం. 13/75—76

ౕ౧౧

# విషయానుక్రమణిక

## నవంబరు 1975





# సాక్షాత్కారం

"కావ్యశ్రీ"

ఎన్నాళ్లనుంచో
ఎన్నేళ్లనుంచో
కళ్ళల్లో వత్తులు వేసుకుని
కళ్ల కాయలు కాసేలా
వెదుకుతున్నాను నీకోసం.
ఎదురు చూస్తున్నాను నీకోసం.

అగుపడని అందానివని
అందని ఆనందానివని
ఆశను చంపుకోలేదు
నిరాశను పెంచుకోలేదు
నీరసపడి-రాపడి-
రాయిడి చెందలేదు.

కాంక్షనే రూపంగా మలిచి
సాక్షాత్కరించుకోవాలని
రంగుల ఊహకు ప్రాణంపోసి
ప్రత్యక్షంగా చూడాలని
కాలంలోని క్షణ క్షణం
నిరీక్షిస్తున్నాను నీకోసం
ప్రకృతిలోని ప్రత్యణువు
పరీక్షిస్తున్నాను నీకోసం

నిన్ను చూడాలనే తపన
తపమై—ఆతపమై
వయసును నిండిస్తుంటే
మనసును పండిస్తుంటే
నా చుట్టూ నేనే పరిభ్రమిస్తూ
నా మదిలో నేనే పరిక్రమిస్తూ
వెదుకుతున్నాను నీకోసం
ఎదురుచూస్తున్నాను నీకోసం

కాంక్షకు రూపం కలిగేదేం ?
కలిగింది కళ్లలో నిలవదేం ?
సృష్టిలోని ఒక్కొక్క కణం
నీలోని ఒకొక్క అణువుగా
ప్రకృతిలోని ఒకొక్క రంగు
నీలోని ఒక్కొక్క అందంలా
విడిగా — విడి విడిగా
అంతటా కనిపిస్తావు —

అయినా ఒక్కటి కాకున్నావు
ఏకత్వంలోని భిన్నత్వమా ?
భిన్నత్వంలోని ఏకత్వమా ?
ద్వైతమా ? అద్వైతమా ?

వసంత వికస్వర
పర్ణవితాప రూపంలో

# సాక్షాత్కారం

నీ తనూ లావణ్యం
నీ మనో విలాసం
ప్రకటిత మయింది-
ప్రవచింప బడింది.

గ్రీష్మ తప ప్రవాళ
ప్రభా ప్రసారంలో
నీ ఓరచూపుల వాడి
నీ దోరచూపులవేడి
ద్యోతకమయింది —
దోబూచులాడింది.

వర్షాభ్రమశ్యామల
నీరదాంతరంగంలో
నీ చిరునవ్వుల విరిజల్లు
నీ సిరిమోమున హరివిల్లు
చలిమంటలు వేసింది —
చెలికారం చేసింది.

శరద్రాకా సుధా నిధీ
శీతా తపశోభిలలో
నీ షోడశాబ్దముల వయసు
నీ షోడశాబ్దార్ధమైన మనసు
నిశ్చలమై నిలిచింది-
నిర్మలమై వెలిగింది.

హేమంత ప్రశాంత
స్రోతస్వినీ కవోష్ణజలాలలో
నీ సుధామయ హృదయం
నీ కరాఘాత జీవనం
తొంగి తొంగి చూచింది
తొణికిసలాడింది.

శిశిర తుషారశీకర
శోభిత శాద్వల సౌందర్యంలో
నీ నవలా నయ నయగారం
నీ నవనీత నవక శృంగారం
కనుల విందుచేసింది—
మనసునందు పూచింది.

అన్ని ! అవన్ని ! నీవే ! నీవే !
అయినా ఒకటిగా లేవే ?
ఒకే క్షణంలో అన్నీ
ఒకటైన రూపంలో,
అవతరించవేం ?
అనుగ్రహించవేం ?
ఎన్నాళ్ల తపన ?
ఎన్నేళ్ల యాపన ?

అనుకోని సమయంలో
ఆలోచనా విహాయసంలో
ఈ శుభ ముహూర్తంలో
ఈ పర్వ మహోదయంలో
నీ సమగ్ర సౌందర్యంలో
నీ సంపూర్ణ రూపంలో
సాక్షాత్కరించావు —
సంభ్రమానంద సమ్మోహాలలో
ఒక్కుమ్మడిగా నన్నుక్కిరి బిక్కిరి చేశావు.

వసంత వికస్వర వర్ణవితాన రూపానివా ?
గ్రీష్మతప ప్రవాళ ప్రభా ప్రసారనివా ?
వర్షాభ్రమశ్యామల నీరతాంత రంగానివా ?
శరద్రాకా సుధానిధి శీతా తపశోభవా ?
హేమంత ప్రశాంత స్రోతస్వినీ జలకవోష్ణానివా?
శిశిర తుషార శీకర శోభిత శాద్వల సౌందర్యానివా?

కాదు —
ఏ ఒక్కటీ నీవు కాదు
నీవే అవన్నీ!
అన్నీ కలిసిన
ఆరూపానికి పేరులేదు —
అదే నీ సంపూర్ణ స్వరూపం.
అంతటా నిండిన
అందానికి నిర్వచనంలేదు—
అదే నీ సమగ్ర సౌందర్యం.
ఆరూపంతో ఆసౌందర్యంతో
ప్రత్యక్షమయ్యావు—
పట్టుబడిపోయావు.

నావంక చూశావు
కడలి అడుగు చల్లదనం
ముద్దచేసి నాతలపై
అద్దినట్లయింది.
నన్నుచూచి నవ్వావు
నీ దోసిట నిండా వెన్నెల
నింపుకొని నా మోముపై
ఒంపినట్లయింది.

చేతులుచాపి రమ్మన్నావు
సృష్టిలోని అనురాగమంతా
పుష్పంచేసి నామీద
గుప్పిళ్లలో చల్లినట్లయింది

కౌగిలిలో నన్నిముడ్చుకున్నావు
ప్రకృతిలోని ఆనందమంతా
అమృతం చేసి నన్ను విలువునా
అభిషేకించి నట్లయింది.

నేను నీలో లీనమయ్యాను —
అనుకొన్నాను—నిజానికి —
నీవే నాలో లీనమయ్యావు
నీవు నా ఆత్మవుకదా!



# అర్వాచీన
# తూర్పు గాంగరాజుల దేవేరులు

డా. సి. వి. రామచంద్రరావు

అర్వాచీన తూర్పు గాంగరాజులు పదునేడుగురు మహానదీ–గోదావరి మధ్యస్థ కళింగాంధ్రమును నాలుగు వందల యేండ్లు (క్రీ.శ.1038–1434) అవిచ్ఛిన్నముగా పరిపాలించిరి. వీరిలో మొదటివాడు అనంతవర్మ అను బిరుదనామమును వహించిన వజ్రహస్తదేవుడు (క్రీ. శ. 1038-1070). అతని తరువాత వారు, వరుసగా, దేవేంద్రవర్మ బిరుదాంకితుడయిన రాజరాజ దేవుడు (క్రీ.శ.1070–1078); అనంతవర్మ చోడగంగదేవుడు (క్రీ. శ. 1078–1152); కామార్ణవుడు (క్రీ. శ. 1147–1156); రాఘవుడు (క్రీ. శ. 1156–1170); ఇమ్మడి రాజరాజ దేవుడు (క్రీ. శ. 1170-1190); ఇమ్మడి అనియంక భీముడు (క్రీ.శ. 1190-1198); ముమ్మడి రాజరాజదేవుడు (క్రీ. శ. 1198-1211); ముమ్మడి అనియంక భీముడు (క్రీ. శ. 1211 – 1238); మొదటి నరసింహుడు (క్రీ. శ. 1238-1263); మొదటి భాను దేవుడు (కీ. శ. 1263 – 1278); ఇమ్మడి నరసింహుడు (క్రీ. శ. 1278-1305); ఇమ్మడి భానుదేవుడు (కీ. శ. 1305–1327); ముమ్మడి నరసింహుడు (క్రీ. శ. 1327–1353); ముమ్మడి భానుదేవుడు (క్రీ. శ. 1353–1378); నాల్మడి నరసింహుడు (కీ. శ. 1378–1409); నాల్మడి భాను దేవుడు (క్రీ. శ. 1409–1434). వీరిలో వజ్రహస్తదేవుని ముమ్మడి వజ్రహస్తదేవుడనుటయు కలదు. ఇచట ఇమ్మడి, ముమ్మడి అను గణనము, వీరి ముందువారును, వీరి సగోత్రీకులును అగు పూర్వగాంగులనుంచి చేసిన గణనము. వజ్రహస్తుని తండ్రి కామార్ణవుడు పూర్వగాంగుల జాబితాలోని వాడు. కామార్ణవుని ముగ్గురు కొడుకులలో చివరివాడు వజ్రహస్త దేవుడు. వజ్రహస్త దేవుడు తన అగ్రజులైన గుండమరాజు, మధుకామార్ణవుల తర్వాత, క్రీ. శ. 1038 లో సింహాసనాధిష్ఠించి, కొన్ని విశిష్టమైన చారిత్రక కారణములవల్ల, అర్వాచీన గాంగులలో ప్రథముడుగా పరిగణింపబడుచున్నాడు.

అర్వాచీన గాంగరాజులలో అధికులు అనేక రాణులను కలవారు. వీరి వివాహములు కొన్ని ఇరు పక్షముల రాజకీయ లాభముల కొరకు జరిగి యుండవచ్చును. వీరిలో మొదటి ముగ్గురు రాజుల తామ్ర పట్టికలు, వజ్రహస్తుని తల్లి వినయ మహాదేవి వైదుంబ వంశపుదని తెలుపుచున్నవి. శాలివాహన శకము (శా. శ 982) (క్రీ. శ. 1060) నాటి వజ్రహస్తుని చిక్కాలవలస శాసనము ఆమె వైదుంబ వంశమనెడి పాలకడలిలో లక్ష్మీదేవి వలె పుట్టినదని తెలుపుచున్నది. "శ్రియా ఇవ వైదుమ్బాన్వయ పయః పయోనిధి సముద్భవాశ్ర్చయః సమజని వినయ మహాదేవ్యాః శ్రీ వజ్రహస్త ఇతి తనయః" [1]. వైదుంబులు 9వ శతాబ్దములో రేనాడు 7000 ఏలికలై యుండినారు. బాణరాజుల సామంతులై యుండిన వీరు. 10వ శతాబ్ద ఉత్తరార్థమునాటికి చోళుల సామంతులై వారితో సంబంధ బాంధవ్యములు నెరపిరి. అరింజయ చోళుడు (క్రీ శ. 956-7) ఒక వైదుంబ రాకుమారిని పెండ్లాడినాడు. వారికి కలిగిన వాడే సుందర చోళుడు (క్రీ శ 957 73). ఏవో కొన్ని పేర్లు తప్పించి, వైదుంబుల చరిత్ర అంతగా తెలియరాదు. వజ్రహస్తుని తల్లియైన వినయ మహాదేవి తల్లిదండ్రులు మనకు ఎరుకరారు.

## వజ్రహస్తుని దేవేరులు :

1) నంగమ లేక అనంగమహాదేవి : ఈమె వజ్రహస్తుని తర్వాత సింహాసన మధిష్ఠించిన రాజరాజ దేవేంద్రవర్మ [illegible]

హస్తుని మొదలు అనంతవర్మ చోడగంగుని వరకుగల తామ్రపట్టికలలో గాని, ముఖలింగం, శ్రీకూర్మం, సింహాచలము మొదలుగాగల తీరాంధ్ర పవిత్ర క్షేత్రములలో లభ్యమైన అనేక గాంగ శిలాశాసనములలో కాని ఈమె పేరు కానరాదు. ముమ్మడి రాజరాజు కాలమునుండి లభ్యమగు గాంగరాజుల తామ్రపట్టికల అవతారికలో ఈమె వజ్రహస్తుని భార్యగా, దేవేంద్రవర్మ రాజరాజు తల్లిగా చెప్పబడి ఉన్నది. ముమ్మడి రాజరాజు దశగోబ (క్రీ. శ. 1198.) తామ్రశాసనమున, ఈమెను గూర్చి "మహిషీ వంగమా తస్య పార్వతీవ పినాకినః తస్మాత్తస్య మభూద్వీరో రాజరాజో మహీపతిః" అని మాత్రము చెప్పబడి ఉన్నది.[2]

2) <u>పృథ్వీమహాదేవి</u> : ముఖలింగమందలి తేదీ లేని ఒక సంస్కృత శిలాశాసనమున వజ్రహస్తుని అగ్రమహిషిగా పేర్కొనబడినది.[3] ఈ శాసనమున పృథ్వీమహాదేవి, వజ్రహస్తుని పరొక రాణియైన 'మారజయ'తో కలిసి మధుకేశ్వరునికి అఖండదీపము సమర్పించినది. ఇంతకన్న ఈమెను గూర్చి వివరములు తెలియరావు.

3) మారజయ : పైన పేర్కొనబడిన శాసనము ఈమె విఖ్యాతుడైన ధర్మసత్రిరాజు తనయగా చెప్పబడినది. "తస్య రాజ్ఞో మహాదేవి మారజయాభిధేయా విఖ్యాత ధర్మసత్రిరాజస్య తనయా" విఖ్యాతుడని చెప్పబడ్డ ఈ ధర్మసత్రి రాజెవరో తెలియరాదు.

4) <u>బెజియదేవి</u> : శా. శ. 998నాటి ముఖలింగమందలి ఒక సంస్కృత శాసనమున ఈమె హైహయ వంశమునకు చెందినదని, భీముని పుత్రియనియు చెప్పబడ్డది. "నృపతే శ్రీ వజ్రహస్తస్య యాదేవి హైహయ రాజవంశ తిలకం జామాతృ భీమాత్మజా దీపం దివ్య గుణాన్వితా బెజియ మాచం దార్కతారం స్థిరం."[5] వశిష్ఠ, వృద్ధ గౌతమీ నదుల అంతర్వేదియైన కోన రాష్ట్రమును పరిపాలించిన కోన హైహయులలో మనకింతవరకు తెలిసిన మొదటికోన హైహయ వంశజుడు ముమ్మడి భీమమహీపతి. ఇతనికి కులోత్తుంగ రాజేంద్ర చోళుడు (క్రీ. శ. 1070-1120) సామంత రాజచిహ్నముల నొసగి మండలేశ్వరుని గావించెను. బెజియ ఈ కోన హైహయ వంశజుడైన ముమ్మడి భీముని పుత్రికయని ఎంచవలసియున్నది. త్రిపురి హైహయులనబడు కలచురి వంశజులలో భీమనామధారులు లేరు.

## రాజరాజ దేవేంద్రవర్మ దేవేరులు

1) <u>రాజసుందరి</u> : అర్వాచీన గాంగ శిలాశాసనములు రాజరాజ దేవేంద్రవర్మ రాణులగూర్చి ఏమియు తెలుపవు. అనంతవర్మ చోడ తామ్రపట్టికల అవతారిక, అతని తరువాత మూడవ రాజరాజ మొదలుగాగల రాజుల తామ్రపట్టికల అవతారికలనుండి రాజసుందరిని రాజరాజదేవేంద్రవర్మ అగ్రమహిషిగా తెలియుచున్నాము. శా. శ. 1034 నాటి అనంతవర్మ చోడగంగుని కొర్ని శాసనము, రాజరాజ దేవేంద్రవర్మ ద్రావిడాహవమున మొదట జయశ్రీని వరించి అటు తర్వాత రాజసుందరి నుద్వాహమాయెనని చెప్పబడ్డది. "స రాజరాజః ప్రథమం జయశ్రియః పతిర్బభూవ ద్రవిళాహవోత్సవే విరాజమానా మథ రాజసుందరీ ముదూఢవాన చోడ మహీభుజాత్మజాం."[6] శా. శ. 1003 నాటి చోడగంగుని కొర్ని శాసనమున రాజసుందరి రాజేంద్రచోళుని కుమార్తె అనియు, రాజరాజ దేవేంద్రవర్మ అగ్రమహిషి అనియు పేర్కొనబడ్డది. "రాజేంద్రచోళస్య తనయా రాజసుందరీ రాజ్ఞస్తస్యాగ్రమహిషీ సతీను తామమాయతా".[7] తరువాతి రాజుల తామ్రశాసనములు ఆమెను "తస్యాగ్రమహిషీ రాజ్ఞో నామ్నా భూద్రాజ సున్దరీ లక్ష్మిర్నారాయణ స్యేవ చన్ద్రస్యేవతు రోహిణీ తతస్తస్యా మాభూద్దేవ చోడ గఙ్గావనీశ్వరః" అని వర్ణించినవి. రాజ రాజ దేవేంద్రవర్మ మిగిలిన రాణుల విషయము తెలియదు.

## అనంతవర్మ చోడగంగుని దేవేరులు

శిలాశాసనములనుండి, తామ్రశాసనములనుండి అనంతవర్మ చోడగంగుని 16 గురు రాణుల పేర్లు మనకు విదితమగుచున్నవి. కాని, వీరి కొన్ని అల్ప విశేషములు మినహా, ఈ శాసనములు ఈ రాణుల తల్లిదండ్రులగూర్చిగాని, వంశాదుల గూర్చిగాని ఏమియు తెలుపవు. అనంతవర్మ చోడగంగుని తర్వాత వచ్చిన తూర్పుగాంగ రాజ పత్నులందరికీ ఇది వర్తించును. ఇచట అనంతవర్మ చోడగంగుని రాణులను గూర్చి శాసనములలో వారి పేర్లు పేర్కొనబడిన కాలక్రమమున తెలుపబడును. గాంగరాణుల పేర్లు చాలమటుకు గాంగశిలా శాసనముల మూలమున మాత్రమే తెలియుచున్నవి. గాంగ తామ్రశాసనములు, వాని అవతారికలలోగల వంశానుక్రమణికయందు పట్టాభిషిక్తులైన రాజుల తల్లిదండ్రులను మాత్రమే పేర్కొనును. తీరాంధ్రదేశమున వివిధ ప్రదేశముల, ముఖ్యముగా ముఖలింగం, శ్రీకూర్మం, సింహాచలం, ద్రాక్షారామం మొదలైన క్షేత్రములగల శిలా శాసనములనుండి చోడగంగుని ఈ క్రింది రాణుల పేర్లు తెలియుచున్నవి.

1) <u>లక్ష్మీదేవి:</u> విశాఖపట్టణం జిల్లాలో రోణంకియందు లభ్యమైన శా. శ. 1015 నాటి రెండు తెలుగు శాసనములు, "శ్రీ మచ్చోడ గంగదేవర ద్వితీయ లక్ష్మియైన లక్ష్మీదేవులు" అని లక్ష్మీదేవిని చోడగంగుని రెండవభార్యగా పేర్కొనుచున్నవి[9] ఒకదాని ప్రతి మరియొకటియైన ఈ రెండు శాసనములు లక్ష్మీదేవి ఉత్తరాయణమువాడు రోణంకి సిద్ధేశ్వర దేవర "నివేద్యమునకుగా నిరువుట్లనేల" ఇచ్చినని తెలుపును. ముఖలింగమందలి శా. శ. 1032 నాటి మరియొక శాసనమున, మధుకేశ్వర దేవునికి నిత్యదీపము సమర్పించిన ఈమె "దయితాం శ్రీ గంగచూడామణే స్సాపత్న్యం తనుదే భువాచ సతతం హాన్యాద్య లక్ష్మీ చయా" అని వర్ణింపబడినది.[10] ఈమెను గూర్చి ఇంతకన్న వివరములు తెలియవు.

శా. శ. 1015 నాటికి చోడగంగునికి 25 సంవత్సరములు పైబడి యుండవు. ఏలనన, శా. శ. 999 లో ఇతను సింహాసనమునకు వచ్చు నాటికి 7 లేక 8 ఏండ్ల బాలుడు. శా. శ. 1015 నాటి శాసనముతో లక్ష్మీదేవి ఇతని రెండవభార్య అని చెప్పబడి యుండుటచే, ఆనాటికే ఇతడు ఇద్దరు కన్యలను పెండ్లాడి నాడని తెలియును. శా. శ. 1050 నాటి ఒక ద్రాక్షారామ శాసనమున జయంగొండ చోడదేవి అనునామె చోడగంగుని "పట్టాన్ మహాదేవి" అని అతని అగ్రమహిషిగా చెప్పబడి యున్నది[11] బహుశః లక్ష్మీదేవిని పరిణయమాడుటకు ముందు చోడగంగుడు జయంగొండ చోడదేవిని పెండ్లాడి యుండవచ్చును.

2) <u>సోమలదేవి:</u> శా. శ. 1030 నాటి ఒక ముఖలింగ శాసనమున ఈమె "గుణ ధామా సోమల మహాదేవి మనోమానస హంసీ యా త్రికలింగ మణ్డల పతేః శ్రీగఙ్గ చూడామణేః" అని చోడగంగుని మనోమానస హంసిగా వర్ణింపబడినది.[12] గంగ శాసనములనుండి ఇతర వివరములు ఈమెనుగూర్చి తెలియరావు. శా. శ. 987 నాటి ద్రాక్షారామమందలి ఒక పద్య శాసనమున తూర్పు చాళుక్యరాజైన రాజరాజ నరేంద్రునికి (క్రీ. శ. 1019–1061) రేవలదేవివల్ల కలిగిన ఒక సోమలదేవి పేర్కొనబడియున్నది.[13] బహుశః చోడగంగుని భార్య సోమలదేవి, రాజరాజ నరేంద్రుని పుత్రిక సోమలదేవి మనుమరాలై ఉండవచ్చునని ఊహ. అనంత వర్మ చోడగంగుని మునిమనుమడైన ముమ్మడి అనియంకుని భార్య ఒకతె సోమలదేవి నామధేయ కలదు. ఈమె విషయమున డి. సి. సర్కారు గారు చూపవలె ... [14]

3) <u>స్వస్తీమహాదేవి:</u> శా. శ 1035 నాటి ముఖలింగ శాసనమందు, మధుకేశ్వర దేవునికి అఖండ దీపమును సమర్పించుచున్న ఈమె, శ్రీ చోడ గంగుని దయితగా ("దయితా శ్రీ చోడ గఙ్గస్య") వర్ణింపబడినది[15] ఈమెనుగూర్చి ఇతర వివరము లేమియు తెలియరావు.

4) <u>యిరకమ్మ:</u> శా. శ. 1035 నాటి ముఖలింగశాసనము ఈమెను గూర్చి "సప్తోర్వీశ్వరిన చోడగంగ నృపతేః ప్రేమైక పాత్రమ్మహాదేవీ శ్రీ యిరకమ్మ నామ విదితా వేమాంబికా నందనా" అని చెప్పియున్నది[16] తండ్రి పేరు చెప్పక, "వేమాంబికా నందనా" అని మాతపేర ఈమె పేర్కొనబడి యుండుటచే, బహుశః ఈమె వేశ్యాపుత్రికయై యుండవలెను. నాడు భోగస్త్రీలకు, గణికలకు సంఘమున గౌరవముండుటచే, ఇట్టి సంబంధము అబ్బురపు కాదు. భోగస్త్రీలు ధర్మపత్నులతో పాటు సమాన గౌరవ ప్రపత్తులతో పేర్కొనబడుట అనేక శాసనములందు గాంచవచ్చును.

శా. శ. 1050 లో చోడగంగుని రాణులు చాలమంది అతనితోగలసి ద్రాక్షారామ భీమేశ్వరుని దర్శించి, ఆదేవునికి అఖండ దీపకైంకర్యముచేసిరని ద్రాక్షారామ శాసనములవలన తెలియుచున్నది. ఈ రాణులందరు తాము చేసిన కైంకర్యమును పేర్కొనుచు, పేరుపేరున శిలాశాసనముల వ్రాయించినను, ప్రతిరాణి శాసనమందు "శ్రీ మదనన్తవర్మ దేవర మహాదేవి" అని చెప్పబడి యున్నది. ఈ శాసనములు వీరిని గురించి ఇతర వివరములేమియు తెలుపవు. ఈ శాసనము లన్నిట, శా. శ. 1050 సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజుల 2 లేక 3 వ పరిపాలనా వత్సరముగ పేర్కొనబడినది. ప్రతి శాసనము, "సమరముఖానేక రిపుదర్పహర్దన భుజబల పరాక్రమ పరమ మాహేశ్వర పరమ భట్టారక మహారాజాధిరాజ రాజ పరమేశ్వర గంగాన్వయా వలంబన స్తంభ" అను చోడగంగుని బిరుద ప్రశస్తిని కలిగియున్నది. ఈ శిలా శాసనములవలన చోడగంగుని ఈ క్రింది రాణుల పేర్లు తెలియుచున్నవి.

5) <u>రాజులదేవి</u>[17]

6) <u>పద్మలదేవి</u>[18]

7) <u>జయ గొండ చోడదేవి:</u> శాసన పద్య ప్రశస్తి లో మున ఈమెను గూర్చి "........ం గొణ చోళతి దేవి యం శ్రీ చోడ గఙ్గ వీక్షితి ప వర నిఘోత్సోఢన ప్రా అని చెప్పబడి ది[19] తెలుగున "శ్రీ మదనన్తవర్మ దేవర పట్టాన మహాదేవి కలింగ మహాదేవమ్మైన

జెయం గొణ్డ చోడియం వారు" అని పేర్కొనబడినది. పటాన మహాదేవి అనుటచే ఈమె చోడగంగుని అగ్రమహిషి అనుట విదితము. పేరునుబట్టి ఈమె చోళరాజకుమారి అనుకొనవచ్చును. ఈమె తల్లిదండ్రులెవరో తెలియరాదు. ఈమెకు సంతానము కలిగినట్లు లేదు. ఏలనన, అనంత వర్మ చోడగంగుని తర్వాత కస్తూరి కామోదిని దేవి[20] తనయుడైన కామార్ణవుడు సింహాసన మధిష్ఠించినాడు.

8) <u>శ్రియాదేవి</u>:[21]

9) <u>లీలావతి</u>: ఈమె పైన చెప్పిన యగకమ్మవలె తన తల్లి లక్ష్మీదేవిని మాత్రము పేర్కొని, తండ్రిపేరు చెప్పలేదు.[22]

10) <u>కళ్యాణ దేవి</u>[23]

11) <u>లావణ్యవతీ దేవి</u>[24]

12) <u>దెన్నవ మహాదేవి</u>: శా. శ 1071 నాటి ఒక ద్రాక్షారామ శాసనమున అట్టహాసదేవుడనువాడు, భీమేశ్వరుని అఖండ దీప సమర్పణ చేయుచు, తాను అనంతవర్మ దేవర ద్వితీయలక్ష్మి యైన దెన్నవ మహాదేవి కొడుకునని చెప్పుకొనియున్నాడు [25] కని, పైన కనుపరచినట్లు, శా. శ. 1015, 1032 నాటి శాసనములలో లక్ష్మీదేవి అనునామె అనంతవర్మ చోడగంగుని ద్వితీయలక్ష్మిగా పేర్కొనబడినది. బహుశా, శా. శ. 1071 నాటికి లక్ష్మీ దేవి గతించగా, దెన్నవ మహాదేవి ఆమెస్థానము, ద్వితీయ భార్యగా ఆక్రమించినదని తలచవలసి యున్నది. అట్టహాసదేవుని కుమారుడు చోడగంగుని శాసనమొకటి సింహాచలమున గలదు.

13) సోమాంబిక : శా. శ. 1037నాటి ఒక ముఖలింగ శాసనమున లోకాంబిక అనునామె తాను "శ్రీ చోడగంగావనీనాథ క్షేత్ర పరంపరోదధి జలో ద్యచ్చంద్రరేఖాకృతి" నని చెప్పికొని యున్నది.[26] అదే శాసనమున ఆమె "సోమాంబికానందనా" అని చెప్పబడియున్నది. ఈ వర్ణనలుబట్టి, లోకాంబిక చోడగంగునికి సోమాంబికవలన కలిగిన కూతురని తలచవలసియున్నది. ఈ సోమాంబికపైన పేర్కొనబడిన సోమలదేవి[27] ఒకరేనో, లేక వేర్వేరు వ్యక్తులో చెప్పుట కష్టము.

మూడవ రాజరాజు కాలమాదిగా అభ్యమగుచున్న చోడగంగుని తరువాతి రాజుల తామ్రపట్టికల అవతారికనుండి, చోడగంగుని రాణుల పేర్లు మరి మూడు తెలియుచున్నవి.

14) <u>కస్తూరి కామోదిని</u>: ఈమె చోడగంగుని తర్వాత సింహాసన మధిష్ఠించిన కామార్ణవుని తల్లి.[28]

15) ఇందిర : కామార్ణవుని తర్వాత గద్దెకెక్కిన రాఘవుని తల్లి. "రవి కులోద్భవ రాజపుత్రీ" అని చెప్పబడ్డది.[29]

16) <u>చంద్రలేఖ</u>: రాఘవుని తర్వాత వరుసగా రాజ్యమునకు వచ్చిన ఇమ్మడి రాజరాజు, ఇమ్మడి అని యంకభీముల తల్లి. ఈమెను గూర్చి శాసనము, "చోడగంగక్షితి వలయపతే ర్వంశ సన్తానవల్లీ కన్ద శ్రీ చన ద్రేఖాసు ఏట మదితి రివ శ్రేయసీ కశ్యపస్య", అని చెప్పినది [30]

ఈ పై ముగురు రాణుల పేర్లు శిలాశాసనములు కానరావు.

చోడగంగుని రాణులలో కొందరు తమ తల్లుల పేరునూ తమ చెప్పుకొని యుండుటనుబట్టి, వారు వేశ్యలకు పుట్టినవారని తలవ వలసియున్నది. వారిని చక్రవర్తి తన రాణులుగ గ్రహించి యుండ వచ్చును. నాడిట్టి ఆచారము అమలులో కలదని చెప్పుటకు, వేశ్యయైన చిన్నాదేవిని కృష్ణదేవరాయలు తన దేవేరిగా పరిగ్రహించుటే తార్కాణము. అంతేగక నాటి సమాజమున, భోగస్త్రీలును, వేశ్యలును, అగ్నిసాక్షిగ పెండ్లాడిన భార్యలతోపాటు, సమాన స్థాయిని, గౌరవమును సంఘమున పొందుచుండిరని చెప్పుటకు అనేక శాసన నిదర్శనములు కలవు [31]

సమకాలీన ధర్మశాస్త్రములు రాజులకు బహుభార్యాత్వము నిషేధించలేదు. రాజుయొక్క భార్యలు, మహిషీ లేక మహాదేవి (పట్టాభిషిక్తురాలైన రాణి), దేవీ (రాజవంశోద్భవ), పరివృక్తి (గౌరవభాజనయైనది), వావతా (ప్రేమ పాత్రయగునది), స్వామినీ (రాజకు హారత్న కావిది), పాలాకలీ (రణమున గెలిచి తెచ్చుకొన్నది), అని, ఆరు రకములుగ విభజించబడిరి. రాజవంశమునకుచెంది అగ్నిసాక్షిగ పరిగ్రహింపబడిన వీరుగాక, రాజు తన ఆనందమునకై వివిధ కళాకుశలురైన 'గణిక'లను, వైశ్య, శూద్ర జాతులకు చెందిన 'అపరోధ వధువు'లను, 'విలాసినుల'ను పరిగ్రహించుటకు అభ్యంతరము లేదు. అనంతవర్మ చోడగంగుడు ఈ సూత్రములను పూర్తిగ అమలులో పెట్టినట్లున్నది.

(సశేషము)

## అధోజ్ఞాపికలు

1. భారతి, 1925, ఫిబ్రవరి, పు. 138 మొ॥

ఎపి గ్రాఫియా ఇండికా (ఎ. ఇ), XXX iii, పు. 141–146లు.

2. ఎ. ఇండికా, XXXI, పు. 249-262లు.

3. దక్షిణ హిందూదేశ శాసనములు. (ద.హిం.శా.), V. 1122.

4 అదే.

5. ద. హిం. శా. 1120

6. భారతి. 1925, నవంబరు, పు, 101 మొ॥

7. భారతి. 1925, ఆగష్టు, పు. 74-86.

8. ముమ్మడి రాజరాజు దశగోబ తామ్రశాసనము, శా. శ. 1120, ఎ ఇండికా, పు. 249 262; ఇమ్మడి నరసింహుని కెందుపట్న తామ్రశాసనము కళింగ సంచిక, పు. 89.

9 ద. హిం. శా, V, 1337, 1348.

10 ద. హిం. శా. V. 1079.

11· జయంగొండ చోడదేవి (శీర్షిక. 7) క్రింద చూడు.

12 ద. హిం. శా. V. 1012.

13 ద. హిం. శా. IV. 1007. శాసనమున ఈ సోమల దేవిని గూర్చి, "శ్రీ విష్ణువర్ధన భూవిభుద — భూమి దేవింబోరె రేవలదేవికనిన సోమల దేవి" అని చెప్పబడినది. ఈమెను రాజరాజనరేంద్రుని తనయగా గుర్తించినవారు శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారు. చూడు, రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక, పు 25మొ॥

14 ఎ. ఇండికా, XXI, పు. 101.

15. ద. హిం. శా, V. 1050

16. ద హిం. శా. V. 1084

17. ద. హిం శా. IV. 1191

18. ద. హిం. శా. IV. 1192

19. ద. హిం. శా. IV. 1194

20. కస్తూరి కామోదిని-(శీర్షిక. 14) క్రింద చూడు.

21. ద. హిం. శా. IV. 1195

22. ద. హిం. శా. IV. 1196, 1197

23. ద. హిం. శా, IV. 1198

24. ద. హిం. శా, IV. 1184

25. ద. హిం. శా. IV. 1199

26. ద. హిం. శా. V. 1076

27. చూడు పైన. శీర్షిక 2. క్రింద.

28. ముమ్మడి రాజరాజు దశగోబ తామ్రశాసనము, శా. శ. 1120, ఎ. ఇండికా, పు. 249-262.

ఇమ్మడి నరసింహుని కెందుపట్న తామ్రశాసనము, కళింగసంచిక. పు. 89.

29 అదే.

30 అదే.

31 ద హిం శా, V. 1083, 1090; VI 668, 876.

# దీప్తి

శ్రీ రామా చంద్రమౌళి

నేను ఒంటరిగా నడిచిపోతున్నాను ఎడారిలో
అనంతాకాశం క్రింద
నా తలలో ఆలోచనల గోళాలు పరిభ్రమిస్తున్నాయి
గుండెల్లోనుండి రస ఝరులు జాల్వారుతూ
ఒళ్ళు ఒళ్ళంతా —
అణువణువూ సముద్రంలా స్పందిస్తోంది
ఈ సాంద్ర విశ్శబ్ద ముద్రలోనుండి
స్వవిశ్లేషణలో పురులు విప్పుకుంటూ
కన్నీళ్ళ గలగలలు,
ఆకలి ప్రేగుల చిరుధ్వనులు...,
శాపగ్రస్తుల్లా బండబారిన బ్రతుకుల అశ్రుస్వనాలూ
—అన్నీ పొంగుతున్నాయి.
నేను విశ్వమానవుణ్ణి — ఒక్కొక్క
చరిత్ర పుటమీద ఒక్కో అడుగేసుకుంటూ పోతున్నాను
మళ్ళీ "రేపు" ను సృష్టించేందుకు
ఈ కన్నీళ్ళూ, బాధలూ, చీకటి ధారలూ
ఎన్నడూ శాశ్వతంగా లేవు
— అదిగో
అరుణ దీప్తితో
సూర్యోదయమౌతోంది.

———

# గ్రామీణ బ్యాంకులు: కొన్ని ఆలోచనలు

శ్రీ ఐ. సత్యసుందరం

అక్టోబరు రెండు నాటికి పదిహేను గ్రామీణ బ్యాంకులు స్థాపించవలెననెడి ప్రభుత్వ నిర్ణయము ఆనందించదగినది. అయితే, గ్రామీణ బ్యాంకులను స్థాపించుటలో ఉన్న ఇబ్బందులను, అవి ఎదుర్కొనవలసిన సమస్యలను ప్రభుత్వము, బ్యాంకింగు సిబ్బంది సరిగా అవగాహన చేసికొనక పోయినచో వీటివలన సరియైన ఫలితాలు కల్పించవు. గ్రామీణ ప్రాంతాలలో సన్నకారు రైతులకు, ఆర్థికంగా వెనుకబడినవారికి పరపతి సౌకర్యాలు ఎక్కువగా కల్పించుటయే ఈ గ్రామీణ బ్యాంకుల స్థాపన ముఖ్యోద్దేశము. ఏప్రిల్ ఒకటి 1977 నాటికి ప్రభుత్వం 50 గ్రామీణ బ్యాంకులు స్థాపించదలచినది. ప్రతి గ్రామీణ బ్యాంకుయొక్క అధికృత మూలధనం (authorised capital) ఒక కోటి రూపాయలు, చెల్లించిన మూలధనము (paid-up capital) 25 లక్షల రూపాయలు. వాటా మూలధనం సమకూర్చుటలో కేంద్రప్రభుత్వము, రాష్ట్రప్రభుత్వము, గ్రామీణ బ్యాంకు స్థాపనకు అనువర్తించిన వాణిజ్య బ్యాంకు 50, 15, 35 నిష్పత్తిలో పాల్గొనును. ఆర్థికంగా వెనుకబడిన ప్రాంతాలలోగాని, కొన్ని జాతుల ప్రజలు నివసించే ప్రాంతాలలోగాని, లేక వాణిజ్య బ్యాంకులు, సహకార సంఘాలనుండి సౌకర్యాలు లేని ప్రాంతాలలో గ్రామీణ బ్యాంకులు స్థాపించుట జరుగును. అయితే ఈ ప్రాంతాలకు అభివృద్ధి అవకాశములు ఉండవలెను. అంటే గ్రామీణ బ్యాంకులు సమకూర్చే పరపతి సహాయముతో ఆ ప్రాంతాలకు అభివృద్ధి చెందగలిగే శక్తి వుండవలెను.

గ్రామీణ ప్రాంతాలలో ధనవంతులకు పొదుపుచేసే అలవాటు తక్కువగా వుండుట వలన బ్యాంకులు ఆ ప్రాంతాలనుండి ఎక్కువగా డిపాజిట్లు సేకరించుటకు అవకాశమున్నది. గ్రామీణ ప్రాంతాలలో సామాన్యంగా ఉత్పత్తికి ఉపయోగపడని పెట్టుబడి ఉదాహరణకు బంగారం, వగైరా రూపంలో ఎక్కువగా వున్నది. అంటే ఈ ప్రాంతాలలో పొదుపుచేసే శక్తి ఎక్కువగా వున్నప్పటికి చాల తక్కువ పెట్టుబడిని ఉత్పత్తికి వుపయోగించుటవలన గ్రామీణ ప్రాంతాల ఉత్పత్తి కుంటుపడుచున్నది. గ్రామీణ ప్రాంతాలలో అధిక సంఖ్యలో అనుబంధ శాఖలను స్థాపించినంత మాత్రాన ఈ సమస్య తీరదు. గ్రామీణ ధనికులకు బ్యాంకులతో సంబంధము తక్కువ. పట్టణ ప్రాంతాలలో డిపాజిట్లను సంపాదించుటకు అవలంబించే పద్ధతులు గ్రామీణ ప్రాంతాలకు సరిపడవు. గ్రామీణ ప్రజల అలవాట్లు, దృక్పథాలు, అవసరాలు వేరుగా నుండుటచే ఆ ప్రాంతాలలో డిపాజిట్లను సంపాదించుటకు ప్రత్యేక పద్ధతులు అవలంబించవలయును.

గ్రామీణ ప్రాంతాల ఖాతాదారులలో ఎక్కువమంది నిరక్షరాస్యులగుటచేతను పొదుపు మొత్తాలను డిపాజిట్లు చేయుటలో మామూలుగా పట్టణ ప్రాంతాలలో అవలంబించే పద్ధతులు వారికి సరిపోవు. గ్రామీణ బ్యాంకులు పనిచేసేతీరు గ్రామీణ ఖాతాదారులకు ఎటువంటి ఇబ్బందులు కల్పించవని ప్రస్ఫుటము తెలిపినది. ప్రాంతీయ భాషలోనే బ్యాంకు పనులన్నియు జరుగును. ఋణాలు తీసికొనేవారి తరఫున బ్యాంకు ఉద్యోగులే ఫారములను పూర్తిచేయుట జరుగును. ఈ విధంగా మధ్యవర్తులనుండి వచ్చే ఇబ్బందులను తొలగించుట జరుగును.

పై వివరాలనుబట్టి గ్రామీణ బ్యాంకులు సిబ్బంది విషయములో, పనిచేసే తీరులోను మామూలు వాణిజ్య బ్యాంకులవలెకాకుండా గ్రామీణ పరిస్థితులకు సంబంధించి వుండునని తెలియుచున్నది. ఇటీవల కాలంలో సన్నకారు రైతులకు ఇతర ఆర్థికంగా వెనుకబడిన వారికి వాణిజ్య బ్యాంకులు ఎక్కువ ఋణాలు సమకూర్చుట జరిగెను. అయితే దేశ జనాభాలో 70 శాతము వ్యవసాయరంగంపై ఆధారపడుట వలన, 80 శాతంమంది గ్రామీణ ప్రాంతాలలో నివ

సించుటవలన గ్రామీణ ప్రాంతాలకు పరపతి సౌకర్యాలు తక్కువ స్థాయిలో వున్నవి. ఇటీవల కాలంలో సహకార సంఘాల స్వల్పకాలిక మధ్యకాలిక ఋణాలు 1951-52లో 24 కోట్ల రూపాయలు ఉండగా, 1971-72లో 600ల కోట్ల రూపాయలు, 1973-74లో 815 కోట్ల రూపాయలు వుండెను. ప్రస్తుతం రైతుల ఋణాలలో 30%సహకార సంఘాలు సమకూర్చుచున్నవి. అయినప్పటికీ, వ్యవసాయరంగానికి కావలసిన మొత్తం పరపతిలో 2/3వంతు మాత్రమే సంస్థలద్వారా లభించుచున్నవి. గ్రామీణ ప్రాంతాల పరిస్థితులు సహకార సంఘాలకు బాగా తెలిసినప్పటికీ పరిపాలనా నిర్వహణలో లోపములుండుట వలన అవి డిపాజిట్లను ఎక్కువగా సంపాదించుటలేదు. వీటిపై కొంతమంది వ్యక్తుల ప్రాబల్యమున్నది.

1969లో జాతీయము చేసిన తరువాత వాణిజ్య బ్యాంకులు వ్యవసాయరంగమునకు ఋణాలను ఎక్కువగా పెంచినవి. 1969 జూన్‌లో గ్రామీణ ప్రాంతాల్లో అనుబంధ శాఖల సంఖ్య 1833 వుండగా, 1975 మార్చిలో వీటిసంఖ్య 6,697 వున్నవి. క్రొత్తగా స్థాపించిన అనుబంధ శాఖలలో 48% గ్రామీణ ప్రాంతాలలో వున్నది. 1969 జూన్‌లో వ్యవసాయ రంగానికి వాణిజ్య బ్యాంకుల ప్రత్యక్ష ఋణాలు 54కోట్ల రూపాయలు వుండగా జూన్ 1974 నాటికి అవి 435 కోట్ల రూపాయలకు, 1974 డిసెంబరు నాటికి అది 540 కోట్ల రూపాయలకు పెరిగినది. ఈ పెరుగుదల ఎక్కువగా కన్పించినప్పటికీ, వాణిజ్య బ్యాంకులు తమ మొత్తం ఋణాల కంటె డిపాజిట్ల సేకరణతోనే ఎక్కువ శ్రద్ధ చూపును. గ్రామీణ ప్రాంతాలలో ఎక్కువ అనుబంధ శాఖలు తాము సమర్ధవంతంగా పనిచేయుటకు వీలుగా డిపాజిట్లను సేకరించుట జరుగలేదు.

గ్రామీణ ప్రాంతాలలో సేకరించిన డిపాజిట్లు పట్టణ ప్రాంతాల అభివృద్ధికి వినియోగించుట హానికరం. ఇందువలన గ్రామీణ ప్రాంతాల్లో అధిక సంఖ్యలో అనుబంధశాఖలు స్థాపించుట వలన ప్రయోజనముండదు. గ్రామీణ అనుబంధ శాఖలు వెనుకబడిన ప్రాంతాలల్లో స్థాపింప బడినప్పటికీ వాటి అభివృద్ధి విషయంలో అవి తగిన శ్రద్ధ చూపుటలేదు. వాణిజ్య బ్యాంకులు గ్రామీణ బ్యాంకులు ఈ పరిస్థితిని మార్చి గ్రామీణ ప్రాంతలలో సేకరించిన డిపాజిట్లు ఆ ప్రాంతాల అభివృద్ధికి వినియోగించునట్లు చూడవలెను. పెట్టుబడి గ్రామీణ ప్రాంతాలనుండి పట్టణ ప్రాంతాలకు వచ్చుటవలన అనేక సమస్యలు వచ్చుచున్నవి అభివృద్ధి కార్యక్రమములు విస్తృత పరచుట ద్వారా వాణిజ్య బ్యాంకులు, గ్రామీణ బ్యాంకులు గ్రామీణ ప్రజలకు గ్రామీణ ప్రాంతాలలోనే ఎక్కువగా ఉద్యోగావకాశములు కల్పించ వలయును.

ఇంతకుముందు చెప్పినట్లుగా గ్రామీణ ప్రజల ప్రవర్తనలో, దృక్పథంలో సరియైన మార్పు తెచ్చుట గ్రామీణ బ్యాంకుల ముఖ్య కర్తవ్యము. పొదుపు పెట్టుబడిపెంచవలసిన అవసరమును గ్రామీణ ప్రజలకు గ్రామీణ బ్యాంకులు తెలుప వలయును. కేవలం ఋణాలను సమకూర్చుట డిపాజిట్లను సేకరించుటలో గ్రామీణ బ్యాంకులు సంతృప్తి చెందకూడదు. గ్రామీణ ప్రాంతాల అభివృద్ధి విషయంగా ఇంకా అనేక యితర విధాలుగా గ్రామీణ బ్యాంకులు పాల్గొన వలయును. ఉత్పత్తికి ఉపయోగపడే పెట్టుబడియొక్క ఆవశ్యకతను ప్రజలకు గుర్తుచేయుటద్వారా, సాంఘికాచారాలపై ప్రజల అనవసరపు ఖర్చులను తగ్గించవలయును. సాంఘికాచారాలపై ప్రజల అనవసరపు ఖర్చు చేయుటవలన గ్రామీణ ప్రజలలో ఎక్కువ మంది శాశ్వతంగా ఋణగ్రస్తులగుచున్నారు. ప్రస్తుతం గ్రామీణ ఋణగ్రస్తతను తగ్గించుటకు ప్రభుత్వము కృషి చేస్తున్నప్పటికీ గ్రామీణ ప్రజలు ఉత్పత్తికి వుపయోగపడే పెట్టుబడియందు, కష్టపడి పనిచేయుట యందు ఎక్కువ శ్రద్ధచూపింపకపోయినచో అంతగా ప్రయోజనముండదు. కర్మ సిద్ధాంతముపై ప్రజల నమ్మకమును పోగొట్టవలయును.

గ్రామీణ బ్యాంకులను నడుపుటకు సిబ్బందిని ఎన్నుకొనుటలో తగిన జాగ్రత్తను చూపవలయును. వాణిజ్య బ్యాంకులు పట్టణ ప్రాంతాలల్లో ముందుగా స్థాపింపబడుటచే వాటిని నడిపే సిబ్బందికి పట్టణప్రాంతాలపైనే శ్రద్ధ ఎక్కువ. గ్రామీణ ప్రాంతాల అభివృద్ధి విషయంలో శ్రద్ధ తక్కువ. స్థానిక పరిస్థితులను అవగాహన చేసికొన్న సిబ్బందిని మాత్రమే గ్రామీణ బ్యాంకులలో నియమించవలయును. వారు గ్రామీణ ప్రజల పరిస్థితులను పూర్తిగా అర్థము చేసికొనుటయేగాక ఆ ప్రాంతాభివృద్ధికి సంబంధించిన సమస్యలను అర్థము చేసికొనవలయును. అందుకు అవి సహకార సంఘాలపై ఆధారపడి వుండవలయును.

గ్రామీణ ప్రాంతాల పరిస్థితులకు సరిగా అవగాహన చేసికొనినచో, ఋణాలను సక్రమంగా వినియోగించుకొనే వారిని గుర్తించుట తేలిక. సరియైన భద్రత లేకపోయిన బాగా కష్టపడే చిన్న వ్యాపారమునైన సమర్ధవంతముగా నిర్వహించినచో ఋణాలను సమకూర్చ

గ్రామీణ ప్రాంతాలలో నిరుద్యోగము ఎక్కువగా వున్నది. గ్రామీణ ప్రజలకు సంవత్సరంలో కొంతకాలము మాత్రమే పని వున్నది ఉద్యోగావకాశాలు తక్కువగా నుండుటచే తక్కువమంది చేయగల పనిని ఎక్కువమంది చేయుచున్నారు. దీనికే ప్రచ్ఛన్న నిరుద్యోగము అందురు. ఈ కారణంగా ఉద్యోగావకాశములు ఎక్కువగా పెంచే అభివృద్ధి కార్యక్రమాలలో గ్రామీణ బ్యాంకులు ఎక్కువ శ్రద్ధ చూపవలయును. అయితే కేవలం ఉద్యోగావకాశములు కల్పించుటయే కాకుండ చేపట్టిన ప్రాజెక్టులు గ్రామీణ ప్రాంతాల అభివృద్ధికి కూడ తోడ్పడవలయును. ప్రభుత్వ, ప్రజల సహాయంతో గ్రామీణ ప్రాంతాల మొత్తం అభివృద్ధిని సాధించుటలో గ్రామీణ బ్యాంకులు మంచి విజయాన్ని సాధించవచ్చుని ఆశించ వచ్చును.

వలయును. ఈ విధంగా గ్రామీణ బ్యాంకులు గ్రామీణ ప్రాంతాల మొత్తం అభివృద్ధిలో పాల్గొనును.

ఇంతేకాక అభివృద్ధి కార్యక్రమాల ప్రాధాన్యతను కూడ గ్రామీణ బ్యాంకులు గుర్తించవలయును. అంటె ఏ అభివృద్ధి కార్యక్రమములను ముందు చేపట్టవలయును, వీటిని తరువాత చేపట్టవచ్చునో, గ్రామీణ బ్యాంకులు నిర్ణయించుకోవలయును. ఒక ప్రాంతంలో అభివృద్ధి నిరోధక శక్తులను కూడ గ్రామీణ బ్యాంకులు గుర్తించి నిర్మూలించవలయును. తగినంత పరపతిని పొందుటవలన తాము అభివృద్ధి చెందగలమను విశ్వాసము గ్రామీణ ప్రజలలో కల్పించవలయును. ప్రస్తుతం గ్రామీణ ధనికులు అంతనా వ్యాపారమునకు ప్రాధాన్యత యిచ్చుటచే పెట్టుబడి ఉత్పత్తి ఉపయోగపడుటలేదు. ఇందువలన అభివృద్ధికి అనుకూలమైన దృక్పథము వాతావరణము కల్పించుటయే గ్రామీణ బ్యాంకుల ముఖ్య కర్తవ్యము.

---

# విముక్తి

**శ్రీ కేవస్వీ**

వెనకాలప్పు నల్లమబ్బును నేను
ఎక్కడ పుట్టేనో !
ఎక్కడెక్కడ తిరిగేనో !
ఇక్కడి కెందుకొచ్చేను ?

ఓ–మృత్యు శీతల పవనమా ! రా !
నన్ను కదిలించు !
నన్ను కుదిలించు ! కవిలించు !

నా గుండె కరిగిపోనీ !
నా కనులు కరిగిపోనీ !
ఈ 'నేను' కరిగిపోనీ !

ఈ మట్టిలోకి కురిసిపోతాను !
ఈ మట్టిలో ఇంకిపోతాను !
మళ్ళీ తరలేస్తాను —

# జనాభా సమస్యా ఆహార సమస్యా?!

డా. బి. ఆర్. కె. రావు

జనాభా విషయం ప్రత్యేక రీతిలో ఆతురతను రెచ్చగొడుతోంది: గట్టి ఉద్రేకాల్ని పుట్టిస్తోంది జనాభా చిన్నదా, పెద్దదా, పెరుగుతోందా లేక తరుగుతోందా అనే విషయం ప్రాముఖ్యం వహిస్తోంది. జనాభా పరిమాణంలో అనేక కారణాలవల్ల మార్పులు వస్తున్నవి. ఇందువల్ల అనేక ఫలితాలు కల్గుతున్నవి, అయితే జనాభా విషయం ఖచ్చితంగా ఎలా ముఖ్యమైనది; ఎందుకు ముఖ్యమైనది అనే విషయం చెప్పడం బహు సంక్లిష్టతతో కూడుకున్నది. ముఖ్యమైన విషయాల్లో అనిశ్చితత మౌఢ్యవాదానికి ప్రోత్సాహకంగా, జనాభాను గురించిన అభిప్రాయాలు కేవలం విశ్వాసాలుగా మిగిలిపోతున్నవి నాడు, నేడూ కూడా జనాభానుగురించిన తీవ్రాభిప్రాయాలు వాటిని సమర్థించడానికి అభ్యమౌతున్నా సాక్ష్యాధారాలకు విలోమ సంబంధంలో ఉంటున్నవి.

జనాభా సమస్యలపై జరిగే చర్చలో జీవితానికి సంబంధించిన జనన, జనోత్పాదన, మరణాలు ప్రముఖస్థానం వహిస్తున్నవి ఈ చర్చలు కొన్ని సందర్భాల్లో పరస్పర విరుద్ధమైన అభిప్రాయాలతో కూడిన సమిష్టి కర్మవైపుకు సాగుతున్నవి. తరుగుతున్న జనాభా వృద్ధి జనాభా తరిగి, నశించే అవకాశంగాను, పెరుగుతున్న జనాభా తెగ బలాన్ని, జాతి బలాన్ని పెంచుతున్నట్లు, అధిక సంఖ్యలో కన్పించే జనాభా క్షామానికి, ఆకలికి ప్రోత్సహిస్తున్నట్లు భావించబడుతోంది. ఇటువంటి ప్రాతిపదిక అభిప్రాయాలు జనాభా ఆలోచనను గతంలో ప్రభావితం చేయడమేగాక నేటికీ చెలామణి అవుతున్నవి.

ఈనాడు పెరుగుతున్న జనాభా, ఆహార సరఫరా పెరుగుదలను అధిగమించి ప్రపంచాన్ని లేదా కనీసం అల్పాభివృద్ధి దేశాల బీదల్ని ఆకలి బాధకు గురిచేస్తున్నదని అనేకమంది ఆందోళన చెందుతున్నారు. అయితే యిటువంటి భయాలు క్రొత్తవేమీకాదు. మాల్థస్‌కుముందే, అధిక జనాభాను చూపించి, తగినరీతిలో ఆహారం అందవలసిన వారనేకమందున్నారని చెప్పడం జరిగింది.

జనాభావృద్ధికి ఆహారసరఫరా హద్దు నెలకొల్పుతుందని, ఆహారం లభ్యమైనమేరకు జనాభా పెరుగుతుందని చెప్పే సూత్రంకంటె అపఖ్యాతి పాలైన సిద్ధాంతం చరిత్రలో మరొకటిలేదు. పైసూత్రాన్ని చెప్పినారు వ్యవసాయరంగంలో మార్పును తెచ్చే ప్రక్రియను ఊహించలేకపోయారని విమర్శించబడింది. కాని సాక్ష్యం అంత స్పష్టంగా లేకపోయినప్పటికీ, కొన్నిచోట్ల జనాభావృద్ధి ఆహారకొరతను సృష్టించింది. కాని యీనాడు అల్పాభివృద్ధి దేశాల్లో జనాభా పెరుగుదల పరిమాణం, యిదివరకు యితరదేశాల్లో జరిగిన జనాభా పెరుగుదల పరిమాణంకంటె చాలా పెద్దది. ఆకలి, అల్పపోషణ పెద్దఎత్తున భవిష్యత్తులో కన్పించబోవడమేగాక, అవి యీనాడు నిజంగా బీదదేశాల్లో ఉపస్థితమై ఉన్నవి. రానున్న దశాబ్దాల్లో జనాభా పెరుగుదలవల్ల బీదదేశాల ఆహార డిమాండ్ ఎక్కువగా పెరుగుతుందని చెప్పడానికి నేడదేశాల్లో పెరుగుతున్న ఆహార డిమాండ్ ప్రబలమైన ఆధారంగా ఉన్నది.

జనాభా ఆగమనసూచనలు సూచిస్తున్న, పెరిగిన, జనాభా పరిమాణాన్ని పోషించే శక్తి భూమికున్నదా? దీనికి సమాధానం చెప్పడం అంత సులభంకాదు. అద్యతన భావిలో ఆహార జనాభాల వృద్ధి ఎలా ఉంటుంది? దీర్ఘకాలంలో భూమి ఎంత జనాభా భారాన్ని మోసి పోషించగల్గుతుంది? ఈ రెండు విషయాలను విడివిడిగా ఆలోచించవలసి ఉన్నది.

## భూమి పోషించగల గరిష్ఠ జనాభా

భూమిపోషించగల గరిష్ఠ జనసంఖ్యను అంచనా వేయడానికి భవిష్యత్తులో విజ్ఞాన శాస్త్రానికి, సాంకేతిక విజ్ఞానా (technology) నికి వుండే శక్తిని గురించి, ప్రజలు అనుభవించే జీవన ప్రమాణాన్ని గురించి ఊహాజనిత అంచనాలు వేయవలసి ఉంటుంది. ప్రపంచ జనాభాను నేటి వినియోగస్థాయిలో పోషించడానికి; యీనాడు ధనిక దేశాలలోవున్న జీవనస్థాయివరకు పెంచడానికి లేదా క్రమంగా జీవన

స్థాయి మెరుగుదలను ధారావాహికంగా పెంపొందించడానికి వీలౌ ఉన్నది. యాడంస్మిత్ చెప్పినట్లు మానవుని పొట్టశక్తి ననుసరించి ఆహార వినియోగం పరిమితమే కావచ్చు. కాని జీవన ప్రమాణం పెరిగి అనేక వస్తువులు అవసరమౌతున్న కారణంగా, భూమి సరఫరాచేసే వనరుల కొరకు ఆహారోత్పాదన, యితర వస్తు ఉత్పాదన పోటీ పడ వలసి వస్తుంది. ముఖ్యంగా విజ్ఞానశాస్త్రం ప్రకారం, అన్న, వస్త్ర, నివాస వసతుల ఉత్పాదన కవసరమయ్యే శక్తిని గురించి అతి దూర భవిష్యత్తు వరకు అంచనాలు సాగుతున్న సందర్భంగా వనరుల కొరకు పోటీపడడం పెరుగుతుంది అందువల్ల తగినట్లుగా జనాభా పోషణ జరిగిన తర్వాత మిగిలేదాన్ని గురించి చేసే అంచనాలలో తేడా వస్తుంది.

ఈమధ్య దశాబ్దాలలో ప్రపంచ గరిష్ట జనాభాను గురించి వెల్లడించిన అంచనాలు చాలా విస్తారిగా కన్పిస్తున్నవి రానున్న శతాబ్దంలో జనాభా యీ అంచనాలను అధిగమించి పెరుగుతుంది. హారిసన్ బ్రౌన్ యిచ్చిన 50 బిలియన్ల సంఖ్య, సోవియట్ విజ్ఞానశాస్త్రవేత్త కె. యం. మాలిన్ యిచ్చిన అంచనా, అన్నింటికంటె పెద్ద అంచనాలు, ప్రపంచవ్యాప్తంగా సాగుబడి భూమిని తగినంతగా పెంచవచ్చని, మూలధనం సహాయంతో, ముఖ్యంగా, పెంచవచ్చని, ప్రస్తుత ఉన్నత సేద్యపద్ధతులతో వ్యవసాయ దిగుబడిని నాలుగు అయిదు రెట్లు పెంచవచ్చని, మరల ప్రస్తుత విజ్ఞాన శాస్త్రాన్ని అనువర్తింపజేసే దిగుబడిని మరి రెండురెట్లు పెంచవచ్చని కె. యం, మాలిన్ అభిప్రాయపడ్డారు ఈ ప్రమేయం ప్రకారం, యీనాడు, మూడు బిలియన్ల ప్రజల్లో రెండు బిలియన్లకు కొద్దిగా పైగా జనాభాను పోషిస్తున్న 1.5 బిలియన్లకంటె కొంచెం ... సాగవుతున్న సేద్యపు భూమి దిగుబడి పదినుండి యిరవై బిలియన్ల జనాభాను పోషించగలదు. అసంభవం అనుకుంటున్నటువంటి 9.3 బిలియన్ హెక్టార్లను సేద్యం చేసినట్లయితే 65నుండి 130 బిలియన్ ప్రజలను పోషించవచ్చు. సూర్యరశ్మినుండి వచ్చే శక్తిని ఆహారంగా మార్చవచ్చని ఊహిస్తున్నారు. ఇదే వాస్తవరూపం దాల్చినట్లయితే 143 నుండి 933 బిలియన్ల జనాభాను పోషించవచ్చు మహాసముద్రాల మీదపడే సూర్యరశ్మి శక్తిని కూడా ఆహారంగా మార్చగలిగితే యింకా హెచ్చుమందిని పోషించవచ్చు అంతేగాక సముద్రాల లోపలవున్న ఆహారాలను కూడా మర్చిపోరాదు.

అయితే యిటువంటి దూకుడు గణనలకు, ప్రత్యేక ప్రాంతాలను తీసికొని, ఊహించగలిగిన భవిష్యత్తులో అక్కడ జరగడానికి వీలున్న వ్యవసాయాభివృద్ధిని జాగ్రత్తగా అధ్యయనంచేసి ఆహారోత్పాదన విలువ అంచనా వేయడానికి చేసే ప్రయత్నాలకు చాలా వ్యత్యాసం ఉన్నది. నిజానికి, భూమిని అభివృద్ధి చెయ్యడానికి అయ్యే ఖర్చులను గురించి, శాస్త్రీయ వ్యవసాయంవల్ల వచ్చే రాబడులను గురించి సరైన అభిప్రాయం లేకుండా భవిష్యత్ వ్యవసాయోత్పాదన శక్తిని గురించి ఒక స్పష్టమైన నిర్ణయానికి రావడం అసంభవం. భవిష్యత్ వ్యవసాయాభివృద్ధి ఏ విధంగా జరిగితే అతిమంచి ఫలితాలు రాగలవో సూచించడం మాత్రమే సంభవం కాగలదు.

కేంద్ర ఆఫ్రికా, అమెజాన్ బేసిన్‌లలో భూమధ్యరేఖ మీదున్న నీటి సౌకర్యంగల ఉష్ణప్రాంతపు భూవనరుల్లో అత్యంతపెద్దవని; అభివృద్ధిచేస్తే మన కోర్కెలను తగినట్లు తీర్చగలదని చెప్పవచ్చు. ఉష్ణదేశాల వ్యవసాయానికి సంబంధించిన పరిశోధన శైశవావస్థలో ఉన్నది. ఉష్ణదేశాలలోని వ్యవసాయాన్ని పాడుచేసే వ్యాధుల్ని నివారించడానికి పెద్ద ఎత్తున పరిశోధన జరగాలి. ముఖ్యంగా "ట్సె ట్సె ఫ్లై" వ్యాధిని లేకుండా చేసివెయ్యాలి. తగిన పంటల పద్ధతులను ఏర్పాటు చేయడంద్వారా భూసారాన్ని పోషించి, అచ్చట పుష్కలంగా లభ్యమయ్యే వేడిని, వీటిని ఉపయోగించుకొని సంవత్సరంలో హెచ్చు సంఖ్యలో పంటలు పండించవచ్చు. వరదలను నియంత్రణ చేసి, నీటిపారుదల సౌకర్యాలను సమకూర్చి, భూసారాన్ని కాపాడే అడవుల క్షేత్రాన్ని నాశనం చేయడాన్ని ఆపినట్లయితే ఆహారోత్పాదనను, పశుగ్రాసాన్ని హెచ్చుగా అభివృద్ధి చేయవచ్చని వ్యవసాయ నిపుణులు చెబుతున్నారు.

జనాభా సాంద్రతగల్గి, వర్షధారాలు బాగా లభ్యమౌతున్న దక్షిణ ఆసియాలో కూడా భూ, జల వనరుల్ని బాగా ఉపయోగించుకుని ఆహారోత్పాదనను పెంచే అవకాశాలు బాగా ఉన్నవి. నీటిపారుదల సౌకర్యాలు పుష్కలంగా లభ్యంకావడంవల్ల గతంలో గొప్పవ్యవసాయాభివృద్ధిని అనుభవించి, నేడు ఎడారులుగను, అర్ధఎడారులుగను వున్న సమీప ప్రాచ్యంలో, మురుగునీరు పోయే సౌకర్యం లేక చవుడు. 'నీటి నిలువ' ఏర్పడి, పంటరాకుండా పోతోంది. ఆ పొలాల నీటిని తొలగించివేసి మరల సేద్యంచేసి పంటలు పండించవచ్చు.

దీర్ఘకాలంలో పంటరాలుబడులను, దిగుబడులను పెంచే అవకాశాలు బాగా ఉన్నవి కొత్తరకం విత్తనాలను, రసాయనిక ఎరువులను, క్రిమిసంహారకాలను, నీటిపారుదల వసతులను హెచ్చుగా ఉప

యోగించడంవల్ల పంట దిగుబళ్లను పెంచవచ్చు. అయితే యివన్నీ మామూలుగా పరస్పరాధారాలు.

సాపేక్షికమైన స్వల్పకాలంలో కూడా హెచ్చుమోతాదులో రసాయనిక ఎరువును ఉపయోగించడంవల్ల, ప్రత్యేక ఫలితాలువస్తాయి రసాయనిక ఎరువులకు సహాధానంగా వచ్చే ఫలితాలు పంటరకాన్ని బట్టి, భూమినిబట్టి మారుతూ వుంటాయి. ఆఫ్రికాలోను, ఆసియాలోను యింతవరకు ఉపయోగించనిచోట, నత్రజని, ఫాస్ఫారిక్ యాసిడ్, పొటాష్‌లను విరివిగా ఉపయోగించి పంటను హెచ్చుగా పండించవచ్చు. ప్రయోగక్షేత్రాలాల అనుభవంలో ఒక కిలోగ్రాము నత్రజని నుపయోగించడంవల్ల అదనంగా పదిహేను కిలోగ్రముల వరి బియ్యం వచ్చినట్లు భారతదేశంలో తేలింది. జపాన్‌పంట పెరుగుదల అంచనా కూడా యిదేవిధంగా ఉన్నది ఇంకా మంచి విత్తనాల నుపయోగించి, చీడపురుగుల్ని నియంత్రణచేసి, జపాన్ ఉపయోగించిన ఎక్కువ రసాయనిక ఎరువుల్ని ఉపయోగించినట్లయితే, ఇండియా వరిధాన్యం రాలుబడిని యిప్పటిస్థాయికి రెండున్నర రెట్లకు పెంచవచ్చు. వ్యవసాయ పరిశ్రమకు సంబంధించిన సారస్వతంలో యిటువంటి ఉదాహరణలెన్నో ఉన్నవి. దీర్ఘకాలంలో ప్రజలకు కావలసిన ఆహారం అందడమేగాక జనసాంద్రత సృష్టించే సమస్యల్ని ఎదుర్కొనగలమేరకు కూడా ఆహారం అందే వీలుంది.

అయితే కాలవ్యవధి అతి కీలకమైన చలాంకము. రానున్న శతాబ్దంలో ప్రపంచము స్తబ్దస్థితిలో నిలిచిపోయే అవకాశాలు బాగా ఉన్నవి. అయితే ప్రస్తుత జనాభా అల (wave) మన మాట వినకుండా ముందుకు సాగి తీరేటట్లు కన్పిస్తోంది భవిష్యత్తులో జనాభా గతి సంబంధాలు (Population dynamics) సోమరితనంలోవుండి, వనరుల అభివృద్ధి చాలాకాలం తీసుకుంటుంది కాబట్టి. ప్రస్తుత జనాభావృద్ధి యిప్పటివలె సాగినట్లయితే, రానున్న ముప్పై, నలభై సంవత్సరాలలో, జనాభాను యీనాడు పోషిస్తున్న స్థాయిలో పోషించడానికి, యిప్పుడు ప్రపంచమంతా ఉత్పత్తి చేస్తున్నంత ఆహారాన్ని అదనంగా ఉత్పత్తి చేయవలసి ఉంటుంది. లాటిన్ అమెరికా జనాభా పెద్దరేటుతో పెరుగుతున్నందువల్ల, యీ ముప్పై, నలభై సంవత్సరాల తర్వాత యిప్పటి ఆహారాన్ని రెట్టింపు ఉత్పత్తి చేస్తేనే యీనాటి జీవన ప్రమాణంలో జనాభాను పోషించడానికి వీలవుతుంది. సర్వాంగీకారమైన స్థాయిలో ప్రపంచ జనాభాను పోషించడానికి యీనాటి ప్రపంచ ఆహారోత్పాదనకు మూడున్నరరెట్లు అదనంగా ఉత్పత్తి చేయవలసి ఉంటుంది.

ఈ దీర్ఘకాలావసరము, నేటి ప్రపంచ ఆహారోత్పాదన ప్రవృత్తికి పూర్తిగా విరుద్ధంగాఉన్నది.

భవిష్యత్ ఉత్పాదనను గురించి చేసే ఆర్థిక ఆగమన సూచనల విషయంలో ప్రాంతీయోత్పాదకత, భవిష్యత్ శ్రామికశక్తి బలాన్ని గురించి చేసే ప్రయోగాలలో వేడాలుంటున్నవి. అయితే భవిష్యత్ ఆహార సరఫరా, భవిష్యత్‌లో రాబోయే పంట దిగుబడిని గురించి చేసే అంచనా సూచనలకు సేద్యయోగ్యమైన భూమిని, లభ్యమవడానికి వీలున్న పంట రాలుబడిని ఆధారంగా తీసుకుంటారు. కాని యీ అంచనాలు నిక్కడూ యిదేవిధంగా జరుగుతాయని చెప్పడానికి వీలులేదు. చాలాకాలం పొదలుగాను, అడవి బంజరుగాను వున్న భూమి సేద్యయోగ్యమైన భూమి, ఖాళీ మైదనాలు, పశ్చిక బయళ్లలో దేనికి ఏందుయుందో చెప్పడం కష్టంగా ఉన్నది. అగ్ని ద్వారా భూమిపై అవసరం లేనివాటిని తొలగించడం ఆర్థికంగా లాభదాయకమైనటయితే, ఆపద్ధతే సమర్థవంతమైన మార్గంగా తీసుకోబడుతోంది. ఉష్ణదేశాలలో పొదలున్న బంజరుగా వుంచడం ద్వారా భూసారాన్ని పునఃనిర్మాణం చేయవచ్చుని ప్రయోగాలవల్ల తెలిసింది. అందువల్ల, ప్రపంచంలో లభ్యమయ్యే సేద్య యోగ్య భూమిని ఖచ్చితంగా అంచనా వేయడం సాధ్యంకాలేదు.

చీడ పురుగులవల్ల, వ్యాధులవల్ల నాశనమైన పంటలను అంచనావేయలేదు. ఐక్య రాజ్య సమితిశాఖగా పనిచేస్తున్న ఆహార వ్యవసాయ సంస్థ అభిప్రాయంలో యిలా నాశనమైపోయే పంట వందల మిలియన్ల హెక్టారులనుండివచ్చే పంటకు సమానంగా ఉంటుందనడంలో సందేహంలేదు. రెండవ ప్రపంచయుద్ధానంతరం క్రిమిసంహార రకాలు తయారు చేయబడినవి అభివృద్ధి చెందిన దేశాలే వాటిని పూర్తిగా ఉపయోగించడం లేదు: కాగా అల్పాభివృద్ధి దేశాల్లో వాటి అనుసరింపు దాదాపు లేని దానితో సమానంగానే ఉన్నది. అల్పాభివృద్ధి దేశాల్లో ధాన్యం నిల్వలలోకూడా చాలాహెచ్చు రాసులలో పాడైపోతున్నవి ఈ ధాన్యం నిల్వల్లో సగంనుండిమూడవ వంతువరకు పాడైపోతున్నాయని ఊహిస్తున్నారు: ఏమైనా యీ నిల్వలు పాడైపోకుండా కాపాడ్డంలో తగిన చర్యలు తీసుకుంటే చాలా వరకు జయప్రదం కావచ్చు.

ప్రపంచ ఆహారోత్పత్తిని వృద్ధిచేయడానికి వీలు కలుగజేసే పద్ధతుల ఫలితాను పరిశీలిస్తే అటువంటి వృద్ధి దగ్గంలో ఆకస్మిక

మైన ఆటంకాలేవీ రావని చెప్పవచ్చు. అయితే ఇలాంటి మెరుగుదల తేవడానికవలంబించే పరిశోధన, భూస్థితి సారాల మెరుగుదల, నిలువచేసే వసతుల అవకాశాలు, వ్యవసాయిక యంత్రాలు, రసాయనిక ఎరువులు, క్రిమిసంహారకాలను లభ్యంచేయడానికి పెద్ద పెట్టుబళ్ళు అవసరమౌతాయి. విజ్ఞాన, సాంకేతిక విజ్ఞాన శాస్త్రాల పురోగమనం యింకా హెచ్చుగా ముందుకు సాగినట్లయితే ఆహారోత్పాదన ఖర్చులు బాగా పెరుగుతాయి: అయితే వ్యవసాయ ఆధునీకీకరణ వేగంగా జరుగుతుందని ఊహించినట్లయితే, విజ్ఞాన శాస్త్ర (Science) నికి, క్షీణప్రతిఫలప్రక్రియ (Process of diminishing returns)కూ జరుగుతున్న పరుగు పందెంలో ఫలానవారు గెలుస్తారని చెప్పివేయడానికి చేసే ప్రయత్నం అతి తొందరపాటు పని మాత్రమే కాగలదు.

## స్వల్పకాలీన మెరుగుదల అవకాశాలు

జనాభా పెరుగుదల కనుగుణంగా ఆహారోత్పాదన పెరుగుతుందా అనే ప్రశ్నకు శాస్త్రీయమైన సమాధానం లేదని న్యాయదృష్టిగల ప్రపంచ ఆహార వ్యవసాయ సంస్థ రిపోర్టొకటి చెబుతోంది. ఏమైనప్పటికి ఆహార సమస్య పరిమాణాన్ని వెలుగులోకి తెచ్చేందుకు లభ్యమౌతున్న గణాంక సమాచారాన్ని పరిశీలించడం సంభవమేగాక అవసరంకూడా.

వ్యవసాయం ళగ్గించడానికి వీలులేని భూమి కొరతను ఎదుర్కోబోతోందనే విషయమే హెచ్చు ఆందోళనకు కారణమౌతోంది.

చారిత్రకంగా చూచినట్లయితే, యిప్పుడు సేద్యంలోవున్న ఎకరా రాలుబడి పెరగడంవల్లకంటె, సేద్యభూమిని పెంచడంవల్ల జనాభా, మానవ సమాజాలు పెరిగినట్లు కన్పిస్తోంది. ఇంతకు ముందు మన మనుకున్నట్లు, వ్యవసాయభూములకు, అడవులకుల వ్యత్యాసాన్ని తరచుగావున్నదానికంటె హెచ్చుచేసి చెప్పారు. సమగ్ర దృష్టితో ఆలోచించినట్లయితే ఒక భాగాన్ని లాభదాయకమయ్యే రీతిలో సేద్యభూమి, పచ్చిక బయళ్ళుగా ఉపయోగించారని, వంక భాగము పనికిరానిదని చెప్పడము సరికాదు. నిజానికి వ్యవసాయ చరిత్ర భూమిని సాంద్రంగా ఉపయోగించడంగా చదువవలసి ఉన్నది; ఇందులో సేద్యభూమిని, తుప్పలున్న భూమిని, అడవి బంజర్లను శాశ్వతంగా స్థిరపడి నివసించడానికి అనువుగా మార్చినట్లు కన్పిస్తుంది.

ఈ అభివృద్ధి ప్రవాహంలో శ్రమశక్తి వల్లనచ్చే ప్రతిఫలాలు పడిపోతున్నట్లు, భూమి యూనిట్ రాలుబడి సాధారణంగా పెరుగుతున్నట్లు కన్పిస్తుంది. రికార్డులు లభ్యమౌతున్న దేశాలస్థితిని పరిశీలించినట్లయితే, పరిమితమైన భూమి ఉపయోగాన్ని గణనలోకి తీసుకున్నప్పటికీ, మధ్య యుగాలనుండి, దున్నదగిన భూమిమీద రాలుబళ్ళు నిలకడగా పెరుగుతూవచ్చినట్లు తెలుస్తోంది.

ఒకటిన్నర శతాబ్దాలకుముందు, ఆహారోత్పాదన ముఖ్యంగా హెచ్చు భూమిని దున్నడంద్వారా లభ్యమౌతుందని థామస్ రాబర్ట్ మాల్థస్ అనుకున్నాడు. ఆహారోత్పాదన వేగంగా జరుగుతుందని మేన్మ శక్తి మాల్థస్‌కు లేకపోయింది. సరైన ఊహాశక్తి లేకపోవడంవల్ల అంక శ్రేణి (1,2,3,4,5 = arithmatic succession)లో సేద్యభూమిని పెంచవచ్చుగాబట్టి, ఆహారంకూడా అంక శ్రేణిలోనే పెరుగుతుందనీ, జనాభా జాతీయ క్రమానికున్న చైతన్య శక్తి (Dynamie Force) లో పెరుగుతుందని చెప్పాడు.

ప్రపంచ ఆహారోత్పాదనకు, ఉత్తర అమెరికా, ఓషియానాలకు ప్రవాసం వచ్చినవారివల్లవచ్చే ఆహారోత్పాదన కలయికను మాల్థస్ అనుచితంగా అంచనా వేశాడు. అంతేగాక ముందుకాలంలో వ్యవసాయోత్పాదకతలో రానున్న వృద్ధిని గురించి తెలిసినట్లు లేదని అనుకున్నారు. కాని యీనాడు పాత్రం, ఆహార సంభారాలు, జనాభా వృద్ధికిమధ్యజరిగే పరుగుపందెం ప్రపంచ ప్రమాణంలో శిఖరస్థాయి కొచ్చినట్లు భావిస్తున్నారు.

అందువల్ల, యింతవరకు అల్పాభివృద్ధిదేశాలు హెచ్చు భూమిని సాగులోకి తేవడం ద్వారా జనాభావృద్ధికి తగ్గ ఆహారాన్ని సరఫరాచేయ ప్రయత్నించినవిగాని, ఎకరాలు బళ్ళను పెంచడంద్వారా పరిష్కరించడానికి ప్రయత్నించలేదని గట్టిగా చెబుతున్నారు. ఇప్పటికి దున్నడానికి వీలైన భూములన్నీ చాలవరకు సేద్యంక్రిందికి తేబడినవి. అందువల్ల ఎకరా రాలుబడిని పెంచి తీరవలసిన సమస్యను ఎదుర్కోవలసి వస్తోంది. అయితే సాంప్రదాయిక సమాజంలో ఎకరా రాలుబడిని పెంచడం కొత్తభూమిని దున్నడంకంటె కష్టము. ఈ పరిమాణం వల్లనే అల్పాభివృద్ధి దేశాలు స్వయంపోషణ శక్తిని కోల్పోతున్నవని చెబుతున్నారు.

అనేక దేశాలనుండి సమీకరించిన గణాంక సమాచార సాక్ష్యం ఆధారంగా సైద్ధాంతికంగా చెప్పబడుతోంది. చాలదేశాల్లో ధాన్యం ఎకరారాలుబళ్ళు ధరావాహికంగా ఒకే రకంగా ఉండటం లేదనే

విషయం యదార్థం. అంటే చెప్పదగినంతకాలం పాటు ఎకరా రాలుబళ్లు పెరిగి మరల తరగకుండా ఉన్నవి. వీటినే వెస్టర్ (బౌన్ ప్లవనాలు (take-offs) అని అన్నాడు. ఆయన అధ్యయనం చేసిన మూడు పురోగామికదేశాల్లోకూడా 1940 వరకు రాలబడి హెచ్చుదల ప్రారంభంకాలేదు అయితే జపాన్‌లో మాత్రము 1880 నుండి రాలుబడి పెరగడం మొదలయ్యింది. కొన్ని పండితులిప్పటికి యీ పెరుగుదలకు మెయిజీ పునరుద్ధరణతో సంబంధం కలుపుతున్నారు. ఇండియా ఎకరా రాలుబళ్లు మాత్రం యీ శతాబ్దం ప్రారంభంలో వున్నట్టే వున్నయ్యి. 1920 తర్వాత 20 శాతం మెరుగుదల మాత్రం వచ్చింది. అయితే యీ మెరుగుదలను కోలుకోవడమని చెప్పవచ్చు 1950 తర్వాత జపాన్ ఎకరా రాలుబడిలో 30 శాతం పెరుగుదలవచ్చింది. అయితే యిందులోకొంత భాగాన్ని కోలుకోవడమని చెప్పినా, మొత్తంమీద యీ మెరుగుదలను పెరుగుదల ప్రవృత్తి లేక వృద్ధి ప్రవృత్తి అని చెప్పవచ్చు.

ఈ సాక్ష్యమంతా చాలా ముఖ్యము; అయితే దీనికి భాష్యం ఎలా చెప్పాలా అనే విషయంలో స్పష్టమైన అభిప్రాయం కన్పించడం లేదు. ఈనాటి అభివృద్ధి చెందిన దేశాలలో వ్యవసాయ ప్లవనం ఆశ్చర్యం గొల్పేంత ఆలస్యంగా ప్రారంభమైనదని చెప్పవలసి ఉన్నది. అయితే వ్యవసాయ విప్లవం పారిశ్రామిక విప్లవానికంటె ముందే జరిగిందని సాధారణంగా నమ్మబడుతోంది. ఇంగ్లండు మాత్రం తన సాంకేతిక విజ్ఞానంతో నాయకత్వం వహించి, ఫ్యాక్టరీ ఉత్పత్తిని పెంచి, ఎగుమతులను అభివృద్ధిచేసి లాభం పొందాలనే ఆకాంక్షతో పారిశ్రామిక విప్లవ నిర్వహణకు పూనుకుని వ్యవసాయ ప్లవనాన్ని కొంతకాలం ఆపివేసుకొన్నదని వెస్టర్ (బౌన్ వాదిస్తున్నాడు. అయితే ఎకరా రాలుబడి ఒక్కటే తుదిస్థాయిలో వ్యవసాయ కార్యనిర్వహణ సామర్థ్యానికి సూచన కాదనే విషయాన్ని ముఖ్యమైన విషయంగా మనసులో ఉంచుకోవలసి ఉన్నది. ఆర్థికాభివృద్ధి ప్రమాణంతో కొలిస్తే, ఆర్థిక శ్రేయస్సుదృష్ట్యా వ్యవసాయ శ్రామికుల ఉత్పాదకత చాలా ముఖ్యం కాగా, ఉత్పత్తిదార్లకు ఉత్పాదకాల (inputs) మీద చేసే వ్యయము ముఖ్యము. కేవలం రాలుబళ్ల దృష్టితో చూచినట్లయితే ఆస్ట్రేలియా కూడా ఇండియా అంతటి పేదదేశమని, ఇండియాలాగా తక్కువ పోషణగల దేశమనే అభిప్రాయం కలగడానికి వీలుంది.

వాస్తవానికి రాలుబళ్ల ప్రవృత్తినుండి సాధారణ నిర్ణయాలు చేయడానికి వ్యవసాయ రంగంలో పెట్టుబడి అక్కడున్న ఉత్పాదకాలలోని వ్యత్యాసం పెద్దగా అడ్డు తగుల్తోంది. ఇతర ఉత్పాదకాలపై జరిగే ఖర్చును గణనలోకి తీసుకోకుండా రాలుబళ్లను గరిష్టం చేయడానికి ఏ దేశం ప్రయత్నించడానికి కూడా కారణం కన్పించదు అయితే రాలుబళ్ల మాత్రం వ్యవసాయ సాంకేతిక విజ్ఞానంలోని ప్రాతిపదిక లక్షణాల్ని తెలియజేస్తాయి. ఏకోన్ముఖంగా ఇంగ్లండు, అమెరికా సంయుక్త రాష్ట్రాలు, ఆస్ట్రేలియాలలో వచ్చిన రాలుబడి మెరుగుదలలకు ద్వితీయ ప్రపంచయుద్ధం, శ్రామికుల కొరత, కొత్త రసాయనిక ఎరువు, క్రిమిసంహారకాల సాంకేతిక విజ్ఞానంతో సంబంధం ఉన్నది అయితే ద్వితీయ ప్రపంచ యుద్ధానికి ముందున్న ఎకరా రాలుబళ్లు, ఆదిమ ఆంగ్లో సాక్సనులు తొల్లికతో త్రవ్వి సేద్యం చేసిన రోజుల్లోగా ఉన్నవని భావించరాదు. ఇరవ య్యవ శతాబ్దం ప్రథమ భాగమంతా యంత్రీకరణద్వారా వ్యవసాయాభివృద్ధి జరిగి వ్యవసాయ శ్రామికుని ఉత్పాదకత పెరిగింది, అయితే రాలుబళ్లు మాత్రం పెద్దగా పెరగలేదు. అయితే ఇంగ్లండులో అభ్యస్తైన రాలుబళ్లు చాలా హెచ్చుగా ఉన్నందున అవి ఆదిమ కాలపు రాలుబళ్లకు ప్రాతినిధ్యం వహిస్తాయనిమాత్రం చెప్పలేము నిజానికి ఒకటి లేక రెండు శతాబ్దాలముందు వచ్చిన అభివృద్ధికరమైన మార్పు ఫలితంగానే యీ హెచ్చురాలుబళ్లు లభ్యమౌతున్నవి.

అయితే మానవ సమూహాలు మొదట వైశాల్య విస్తరణ ద్వారా వ్యవసాయోత్పత్తిని పెంచి, తర్వాత ఎకరా రాలుబడిని పెంచుతాయనే నిర్ణయానికి రావడం మంచిదని మనసారా చెప్పడానికి వీలుకాదు.

క్రొత్త భూమిని దున్ని సాగుచేయడం ప్రయత్నం అవసరం లేని సాహసం (enterprise) కాదు. నాగరికత ప్రారంభంలో వండు నేలలకు నీటిపారుదల సౌకర్యం అందించడానికి బృహత్ప్రయత్నాలు చేయవలసి వచ్చింది. అటువంటి సాహసాలన్నింటిని కేవలం సాగుభూమి వైశాల్యాన్ని పెంచడమనిగాని, ఎకరా రాలుబడిలో దిగుబడిగొప్ప మెరుగుదలను తేవడమనిగాని, తద్వారా ఒక్క మొక్కకు బదులు రెండు మొక్కలను పెంచడమనిగాని చెప్పవచ్చా?

ప్రస్తుత సమస్యల్ని తీసుకున్నట్లయితే, అల్పాభివృద్ధి దేశాల్లో దున్ని సాగుచేయడానికి వీలున్న భూమి తుది హద్దులవరకు సేద్యం జరిగినదని చెప్పడానికి వీలులేదు. అయితే యీ విషయంలో ప్రపంచంలోని యితర భాగాలకంటె ఆసియా తుదిహద్దులకు సన్నిహితంగా వున్నదని చెప్పవచ్చు. అయితే ఆసియాలోగాని, మరి ఏ యితర చోటనుగాని ఊహించడానికి వీలున్న సేద్యయోగ్య భూమి అపరిమి

తంగా లేదనుటమాత్రం తప్పకుండా నిజమనే చెప్పాలి ఇప్పటికి సేద్యమౌతున్న భూమికంటె యింకా సేద్యంలోకి రాదగ్గ భూమి ఎక్కువే అయినప్పటికీ, చివరికి ఆ భూమినంతటిని సాగుచేసినా, ఎకరా రాలుబళ్లు అవసరమైన మేరకు పెరిగితే మినహా, పెరుగుతూన్న జనాభాను పోషించడం సాధ్యంకాదు.

అందుచేత దీర్ఘకాలీనదృష్టితో ఆలోచించినప్పుడు, అల్పాభివృద్ధి దేశాలు, తమ ఎకరా రాలుబళ్లను పెంచుకోవడంద్వారా, వ్యవసాయోత్పత్తిని పెంచుకుని ఆహార సమస్యను పరిష్కరించుకోవలసి ఉన్నది అయితే అల్పాభివృద్ధి దేశాల వ్యవసాయ ఆర్థిక వ్యవస్థ "నిర్ధారిత వైశాల్య భూ ఆర్థికవ్యవస్థ" (Fixed land economy) లని. అందువల్ల సేద్యయోగ్య భూమిని పెంచడానికి వీలులేదని అనుకోవడం విషయమంతా తెలకపూర్వము నిర్ధారణకు రావడమౌతుంది. 1947-1967 కాలవ్యవధిలో పంటభూముల వైశాల్యం బాగా పెరిగింది. అయితే కాలవ్యవధిరీత్యా యిటువంటి పంటభూముల వైశాల్యం పెరుగుదల అపరిమితంగా జరుగదు కాని ఖచ్చితంగా సంకటం ఏర్పడే భవిష్యత్ దశాబ్దాలలో భూవైశాల్యం పెరుగుదలవల్ల గమనార్హమైన మేలు కల్గుతుంది.

అయితే ఇండియా విషయంలోను, మొత్తం ఆసియా విషయంలోను పై జెప్పిన విషయం తక్కువ యదార్థంగా ఉంటుంది. భారతదేశంలో యిప్పటికే దున్నబడిన భూమి, మొత్తం భారత దేశ భూమిలో ఉన్నత అనుపాతంలో ఉన్నది. సేద్యయోగ్య భూమి విస్తృతం కావడం, సాపేక్షికంగా, తక్కువ అవకాశంగల విషయం. 1948-1963 మధ్య సేద్యభూమి 26 శాతం పెరిగింది అడవి వైశాల్యాన్ని తగ్గించకుండా, భవిష్యత్తులో ఈ సేద్యభూమిని యిక 10 శాతం కంటె హెచ్చు పెంచడానికి అవకాశం లేదని వి. జి. పన్సే, వి. యస్. అంష్లే తమ భారతదేశ భూవనరుల సర్వేక్షణ సమీక్షలో వ్రాసారు భారతదేశ ఆహారావసరాలు, అపేక్షించిన మేరకు, తీరాలంటే భారతదేశ ఎకరా రాలుబళ్లు పెరిగితీరాలి ఇతరచోట్ల విషయంలో కూడా యీ పరిస్థితి కొద్దిపాటు నొక్కుతో తప్పనిసరిగా అవసరం.

ఇతరచోట్ల లభ్యమయ్యే ఎకరా రాలుబళ్లతో పోల్చినప్పుడు అల్పాభివృద్ధి దేశాల రాలుబళ్లు తక్కువగా వుండటము, ఒకవిధంగా ముందు కాలంలో లాభదాయకంగా ఉపయోగించేదే అల్పాభివృద్ధి దేశాల రాలుబళ్లు కొట్టొచ్చినట్లుగా కన్పించేంత తక్కువేమీకాదు భూమిని సాంద్రంగా ఉపయోగించకపోవడంవల్ల వచ్చిన కొరతకంటె, సాంకేతిక విజ్ఞానాన్ని అనువర్తింప చేయకపోవడంవల్ల వచ్చిన రాలుబడి తగ్గుదల హెచ్చుగా ఉన్నది ఇతర విషయాలన్నీ ఒకటిగానే వున్నట్లయితే భూమి హెచ్చుగాను, చవుకగాను వున్నచోట రాలుబళ్లు తగ్గుగాను, భూమికొరతగా వున్నచోట రాలుబళ్లు హెచ్చుగాను ఉంటాయి.

కాని హెచ్చు జనసాంద్రత కల్గి, ఎకరా రాలుబడి తక్కువగా వున్న భారతదేశంవంటిచోట్ల, రాలుబడి పెరుగుదలశక్తి హెచ్చుగా ఉన్నట్లు కన్పిస్తోంది రాలుబడిని పెంచడానికి అవలంబించే మార్గాల్లో శ్రామికుల సంఖ్యను పెంచడాన్ని మొదటి పద్ధతిగా తీసుకోవచ్చు. శ్రామికోత్పాదకాన్ని యిప్పటికే తుది హద్దువరకు ఉపయోగించినట్లయితే కేవలం శ్రమవల్లనే రాలుబడిని పెంచడానికి వీలులేనట్లయితే, శ్రామిక ఉపాంత (marginal) ఉత్పాదన శూన్య (zero) మైనట్లయితే, శ్రామిక సాంద్రతను పెంచడంవల్ల ఏ సత్ఫలితం కూడా చేకూరదు. చాలమంది ఆర్థిక శాస్త్రవేత్తలు ఈ విషయం యిందుకు సంబంధించిందేనని, అధిక గ్రామీణ శ్రామికులవల్ల, ప్రచ్ఛన్న నిరుద్యోగం (disguised unemployment) వల్ల అల్పాభివృద్ధి సమాజాల్లో గ్రామీణ కార్యాలు తక్కువ సాంద్రతతో కన్పిస్తున్నవని చెబుతున్నారు. గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో శ్రామికుల్ని నిలువ సైన్యంగా (Reserve Army) నిలిపి, ఆర్థిక వ్యవస్థ మెరుగుదల కేవిధంగాను తోడ్పడనట్లయితే ప్రణాళికా విధాన నిర్మాణాన్ని ఏర్పర్చడంతో యీ విషయాన్ని ముఖ్యంగా గమనించవలసి ఉంటుంది. ఈ అధిక శ్రామిక శక్తిని మరొక ఆర్థికరంగంలో ఉత్పాదనకు తోడ్పడేటట్లు ఉపయోగించడము ముఖ్య కర్తవ్యమౌతుంది. అధిక శ్రమ శక్తి లభ్యమౌతున్నంతవరకు సాంఘిక వ్యయాన్ని (Social costs) అభివృద్ధి పథకాలవల్ల వచ్చే లాభాలను గణనలోకి తీసుకున్నట్లయితే, అధిక శ్రమశక్తిని స్వేచ్ఛగా లభ్యమయ్యే వనరుగా పరిగణించవలసిఉన్నది. ఆహారాది వస్తువుల వనరుగా పరిగణించవలసిఉన్నది. ఆహారాదివస్తువుల సరఫరాలు, కొరతగావున్న భూమి, మూలధనమువంటి ఉత్పాదన కారకాలు (factors of production) పనిచేయడంవల్లనే లభ్యమౌతున్నవి. భవిష్యత్తులో రాబోయే అంచనాల్లో, ఒక తరంలో శ్రామికులసంఖ్య రెండు రెట్లయినా, మూడు రెట్లయినా, దానిలో ఎట్టి సంబంధం లేకుండా, స్వంత[illegible] పెరిగే ఆహారాన్ని పంచుకుంటుంది.

ఇటీవల పలుకుబడి ప్రాముఖ్యంగల యీ ప్రపేయం వింత వరపు సబబని కొంతమంది ప్రశ్నిస్తున్నారు. భారతదేశ వ్యవసాయం శ్రామిక సాంద్రపద్ధతిలో పనిచేయవచ్చునని, బహుశా భవిష్యత్తులో అలా చేస్తుందని మోర్టన్ పగ్లిన్ అమెరికన్ ఎకనామిక్ రివ్యూలో, 1965 సెప్టెంబరులో వ్రాసిన వ్యాసంలో సలహా యిచ్చారు. భారత దేశ వ్యవసాయాన్ని అభివృద్ధి చేయడంవల్ల, సంబద్ధీకరణ (rationalisation) చేయడంవల్ల హెచ్చు శ్రామికుల్ని యిముడ్చుకోగల్గుతుంది. 1950 – 1960 లో నీటిపారుదల సౌకర్యాలను, దానికి సంబంధించిన మెరుగుదలలను ఏర్పర్చడంవల్ల, సగటున ఎకరానికి 2.4 రెట్లు శ్రామిక శక్తిని పెంచడానికి వీలయ్యింది. దీనితోపాటు, యిదివరకు వీలుగాని, పంటలను కార్మిక సాంద్ర పద్ధతిలో పండించ మొదలు పెట్టడం జరగగానే, మొత్తం శ్రామిక శక్తిని 3.6 రెట్లు పెంచడానికి వీలయ్యింది.

ప్రస్తుత అల్పాభివృద్ధి దేశాల సేద్యాచరణను అధ్యయనం చేసేవారిలో రెండురకాల అభిప్రాయాలున్నట్లు తెలుస్తోంది. ఒక వైపున, వ్యవసాయదార్లు ఆచార, సాంప్రదాయాలకు బద్ధులై వున్నారని ఊహించబడుతోంది; అందువల్ల తమ ఆర్థికస్థితిని పెంపొందించుకునే పద్ధతులు వారికి తెలియవు; నూతన సాంకేతిక విజ్ఞానాన్ని వారి పొరుగున అనువర్తింపచేసి, ఫలితాలను ప్రదర్శిస్తే మినహా, వారి బాగుదలకొరకు యిచ్చిన సలహాను ప్రతిఘటిస్తూనే ఉంటారు. అధిక స్థాయికి చెందిన దేశాల సేద్యాచరణలు తాజా విజ్ఞానానికి ఎంతో వెనుకబడి వున్న రోజుల్లో, ప్రధాన వ్యవసాయ పరిశోధనా సంస్థలు, ప్రధాన రంగాల ప్రజాప్రచారోద్యమాలు లేకుండా నిరక్షరాస్యులతో నిండివున్న దేశాల్లో ప్రజలకు, వ్యక్తిగతంగాగాని, సమిష్టిగాగాని బాగుపడడానికి వీలుకలుగజేసే పద్ధతులు తెలిసివుండాలని, వారు వాటిని అనుసరించాలని అనుకోవడం ఆశ్చర్యాన్ని గొల్పుతుంది.

మరొకవైపున సేద్యంచేసే అల్పాభివృద్ధిదేశాల రైతులు తమ ఆర్థిక పరిస్థితికి గురించి హెచ్చు ఆతురత చూపుతారని, నగదు పంటల ధరల మార్పులకు అనుగుణ్యంగా ప్రపంచంలోని అనేక దేశాల్లో ప్రశంసార్హమైనంత తొందరలో పంటలు పండించారని, వారికి లాభిస్తూ ఆచరిస్తున్న వ్యవసాయ పద్ధతులకు ప్రత్యామ్నాయాలు తెలియవని కాని వాటిని వారు లాభదాయకంకానివని తిరస్కరిస్తున్నారని గట్టిగా చెప్పబడుతోంది. షుల్ట్జ్, బోసరప్‌లు చెప్పినట్లు తెలియని వానికి పురాతన పద్ధతులుగా కన్పించేవి ఆర్థిక దృష్టిలో చాలసపేకములు కావచ్చు. మరొకవైపున వస్తువుల ధరల దృష్టితో చూచినప్పుడు చాలావ్యయంతో కూడుకున్న ఉత్పాదకాలు (inputs) ఆధునిక సేద్యాన్ని నిర్వహించడానికి కావలసిరావచ్చు.

[ఇంకా వుంది]



# నేను - కవిత

శ్రీ జి. శ్రీనివాసరావు

నేను !

నేను నేనుగా ఉంటున్న నేను !!
అందమైన ఊహలతో...ఆశావలయాలను ఛేదిస్తూ...
మందస్మిత మందారపు విరితోటల విహరిస్తూ...
అంచుల దాకిన ఆనందపు తరంగాల తురంగాలపై పరుగిడుతూ...
నడుస్తున్నాను...మురుస్తున్నాను...నవ్వులవెన్నెలలు విరుస్తున్నాను...!!!

వేదనలు వేగంగా తప్పుకున్నాయి...
వాదనలు సరసంగా జారుకున్నాయి ...
విచ్చలవిడిగా...విచ్చుకత్తుల్లా...మెరిసే ఆశాకిరణాలు—
ప్రేమకథల్నీ, సమతాగాథల్నీ, సహృదయనాదాన్నీ ...
విన్పించమని నన్ను పదేపదే అర్థిస్తున్నాయి...!!!

అందుకనే నేను –
నేను నేనుగా ఉంటున్న నేను –
ఆత్మ వంచనకు పాల్పడటం లేదు ...
గొంగళిలో తింటూ వెంట్రుకలేరేసుకోడంలేదు !
అందని ఊహలకు ఆశాపాశం వెయ్యడంలేదు !!
అందుకే...ఉన్నంతలో మంచినెంచి, పాత కొత్తల సరిపోషణ
శ్రీకారంచుట్టి–నాదనే భావంతో చేపట్టి ...

నవ జీవన కవితాగానం చేస్తున్నాను.
నయనానందపు కిమ్మీరాలను చూస్తున్నాను ... ! !
నా కవితారసధుని స్వతంత్రతా విపంచియై—
రాగరసాన్ని పంచుతుంది... ! అనురాగరసాన్ని పంచుతుంది... ! !
మోహన రాగ గీతికా స్రవంతియై నిరంతరం సాగుతూంది ! ! !
మోడువారిన జీవిత లతా నికుంజాలను కిసలయ సంశోభితచేస్తుంది—
మహిత సౌరభ సుస్నిగ్ధలతాంత సంపన్నయై నిలుస్తుంది—

*　　　　*　　　　*

ఏదీ నీ కవితా రసధుని ... ; ? ఏదీ ... నీ కవితా సుసవని ! ?
ఏదీ ... ఏదీ ... ఏదీ ... ! ! ! ? ? ?
అవును ... ఏదీ ? ... అదే నేనూవేసే ప్రశ్న ...
మీకెక్కడ అనుమానమో ... అక్కడే నాకూ సందేహం ...
అందుకే కవిత్వం ... మామూలు కనులకు కన్పించేదికాదంటాను !

అందుకే కవిత్వం మామూలు చెవులకు వినిపించేదీ కాదు !
ఎడదఉన్న ప్రతి జీవికి ... ఈ అనంత విశ్వం
నిజం — ఒక మహోన్నత మహిమాయుత కవితాసంచిక !
వేదనలూ ... వాదనలూ ... త్యజించి రహించే ...
రసహృదయాలను గిలిగింతలు పెట్టే మలయానిల మధుసేచిక ! !

---



# మన జాతి మేలుకొన్నది

మన జాతి మేలుకొన్నది
అంతర్వాణి ప్రబోధం విన్నది
తన శక్తి తాను తెలుసుకున్నది
"ఇక పదండి ముందుకు" అన్నది.

మన ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధి భారత మాత మెడలో యిరవై మణిపూసల హారం వేసింది. ప్రగతి పథంలో మరొక ముందడుగు వేసింది. ఆ మణి కాంతుల ధగద్ధగలు యిప్పుడు దేశమంతటా అల్లుకుంటున్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో............

ఆకాశమంటిన ధరలు అంతలో తగ్గిపోయాయి భూ సంస్కరణల అమలు కృషి శరవేగంతో జరుగుతోంది ఈ యేడు జూన్ నెలాఖరు నాటికి 15 లక్షల 50 వేల యకరాలకుపైగా బంజర్లు పేదవారికి పంచారు. మార్చి నెలాఖరు నాటికి లక్షా ఎనభై అయిదు వేల కుటుంబాలకు - అంటే బలహీన వర్గాల వారికి—ఇండ్ల స్థలాలు యిచ్చారు.

భారీ మధ్యతరహా నీటి పారుదల ప్రాజెక్టుల కేటాయింపు రు. 38 కోట్ల నుండి రు. 49 కోట్లకు పెంచారు. విద్యుచ్ఛక్తి మీద ప్రణాళిక పెట్టుబడి రు. 53.50 కోట్లకు పెరిగింది.

ఈ యేడు మన రాష్ట్రం రు. 10 కోట్ల విలువచేసే—ఎగుమతికి పనికివచ్చే చేనేత వస్త్రాలను ఉత్పత్తి చేస్తుంది. ప్రభుత్వ కేంద్ర ముద్రణాలయం, రాష్ట్ర విద్యుచ్ఛక్తి సంస్థ, రోడ్డు రవాణా సంస్థలలో 500 మందికి శిక్షణ యిస్తారు. ఇందులో మన రాష్ట్రానిదే ప్రథమ తాంబూలం.

సమాచార, పౌరసంబంధ శాఖ, హైదరాబాదు సం. 24/7/5-76.

# రక్తయజ్ఞం

## శ్రీ కలువకొలను సదానంద

(గత సంచిక తరువాయి)

## 5

సుందరం బస్సుదిగాడు.

గంట తొమ్మిది దాటింది.

ఆవేళ ఆదివారం. తాను సుశీల వాళ్ళ వూరికి వెళ్తున్నాడు. పేటనుండి ఆ పల్లె మైలు దూరంలో వుంది.

తీగలా సన్నగా ఒయ్యారంగా వంపులు తిరిగిన కాలిబాటలో నడుస్తున్నాడతను.

చెరకు ఆకుల అంచులకు ఎండ పదును పెడుతూవుంది.

సుందరానికి దాహం వేసింది.

అతడు ఆగాడు. దారిప్రక్కన ఓ పెద్ద సేద్యపుబావివుంది. అతడు బావిగట్టునున్న నిమ్మచెట్ల నీడలలో నిలబడి బావిలోకి తొంగి చూశాడు. బావిలో నీళ్ళు తేటగావుంది. నీడలోని ఆ నీటిలోతులు నీలంగా, నిర్మలంగా వున్నాయి. దిగి, నీళ్ళు తాగాలనిపించిందతనికి. దిగడానికి మెట్లున్నాయి.

భుజానికి వేలాడుతున్న సంచిని తీయబోయాడు సుందరం. అందులో అరటిపళ్ళు, మల్లెపువ్వులూ, బిస్కత్తుల పొట్లం వున్నాయి. అతడు ఆ పువ్వుల్ని చేరికి తీసుకుని ఓసారి మత్తుగా వాసనచూశాడు. ఆనీళ్ళకంటే చల్లని సుశీల జ్ఞాపకం వచ్చింది.

'ఊహూఁ! ఈ నీళ్ళు తాగను. నా దాహం యిక్కడే తీరిపోతే—నీళ్ళు తాగుబావా అంటూ సుశీల తన చల్లని చేతులతో అందించే నీళ్ళకు విలువ తగ్గిపోతుంది. ఈదాహం యిలాగే పెరగనీ!'

అతడు మళ్ళీ కాలిబాటలోకి వచ్చాడు.

చెరువు కట్టదిగి పల్లెలో ప్రవేశించాడు.

వీధిలో కొందరు ఆడవాళ్ళు గుమ్మాలముందర నిలబడి అతన్ని పరికించసాగారు. సుందరం సిగ్గు పడుతూ నడుస్తున్నాడు.

ముందరికి ప్రసరిస్తున్న అతని దృష్టి ఓ యింటి అరుగమీద నిలిచింది. ముగ్గుమీద గొబ్బిపూలు తెచ్చినట్లు—ఈడొచ్చిన ఆడపిల్లలు కొందరు ఆ అరుగుమీద కూర్చుని మాట్లాడుకుంటున్నారు. వాళ్ళలో సుశీలవుంది. ఆమె అల్లంత దూరంనుంచే అతన్ని చూసింది. సంబరంతో పైకిలేచి, అతనివైపు నవ్వుతూ చూచి, అతనికంటే ముందుగా గబగబా నడిచి, యింట్లోకి వెళ్ళింది.

సుందరం లోపల్లోపల మురిసిపోతూ ఆ యింటి అరుగ ప్రక్కగా ముందుకు నడిచాడు. అరుగుమీద కూర్చున్న అమ్మాయిలు గుడ్లప్పగించి నిశ్శబ్దంగా అతన్ని చూస్తూ—అతను ముందుకు వెళ్ళిపోగానే గలగలా నవ్వారు.

'సుశీల వాళ్ళ బావే! అందుకే దానికా పరుగు!' అంది ఓ పిల్ల.

సుందరం వెనక్కి తిరిగి ఆ పిల్ల ముఖం చూడాలనుకున్నాడు. కాని, అలా చూడకుండా పట్టపు ఏనుగులా గంభీరంగా ముందుకే నడిచాడు.

ఇంట్లో అడుగు పెడుతూంటే అతనిగుండె ఎందుకో గుబగుబలాడింది.

'మంచినీళ్ళు తీసుకో బావా!' అంది సుశీల.

సుందరం నీళ్ళందుకుంటూ ఆమె వేలిని తాకాడు.

ఆమె ఆ వేలితో తన కింది పెదవిని మీటుకుంది.

* * *

పిల్లలు నలుగురూ అతని చుట్టూ చేరి ఉత్సాహంగా కబుర్లు చెప్పడం మొదలెట్టారు. సుశీల పెద్ద తమ్ముడు కిరీటి—పేటలో హైస్కూల్లో పదోతరగతి చదువుతున్నాడు. సుబ్బులు ఏడోతరగతి చదువుతోంది. దానిముఖం గుండ్రంగా వుంది. పెద్దకళ్ళు. ఈడొస్తే అందంగా వుంటుంది! కృష్ణమూర్తి నాలుగో తరగతి. జానకీపతి ఒకటో తరగతి.

ఆ మధ్యాహ్నం భోజనం చేసి పడుకుని వుంటే, కృష్ణమూర్తి అతని దగ్గరికి వచ్చాడు.

'బావా! సాయంకాలం ఆంజనేయస్వామి కోవెలకు వెళ్తున్నాం.' అన్నాడు.

'మనిద్దరమూనా?' అన్నాడు సుందరం.

'నువ్వూ, ,నేనూ అక్కయ్యా!'

'నువ్వెందుకూ?' అన్నాడు సుందరం మెల్లగా.

'అక్కడ ఉయ్యాల వుందిగా? వూగటానికి!'

సాయంకాలం మూడుగంటలైంది.

'అమ్మా! నీళ్ళు కాగేయి!' అంటూ కేకవేసింది సుశీల దొడ్లోనుంచి.

'లేచి స్నానం చెయ్యి సుందరం!' అంది శాంతమ్మ.

సుందరం లేచి పెరట్లోకి వెళ్ళాడు. వేడినీళ్ళు సిద్ధంగా వున్నాయి. అతను స్నానం చేస్తూంటే ఇంట్లో గారెలు కాలుస్తూన్న శాంతమ్మ 'ఒసే సుబ్బులూ! వెళ్ళి మీ బావకు వీపు రుద్దమ్మా,' అంటోంది.

'ఊహూఁ! నువ్వే వెళ్ళి రుద్దు' అంటోంది సుబ్బులు.

'ఓసి, నీ సిగ్గు బంగారంకానూ!'

సుశీలవచ్చి వీపు రుద్దితే బాగుంటుందనుకున్నాడు సుందరం, సుశీల రాలేదు. శాంతమ్మవచ్చి వీపు రుద్దింది.

సుందరం స్నానంచేసి ఇంట్లోకి వెళ్ళాడు. పంట్లాం, చొక్కా తొడుక్కున్నాడు. చేతిరుమాలు బాగా నలిగిపోయింది. చెమట వాసన వేస్తోంది. దాన్ని సబ్బువేసి వుతుక్కుందామని ఉండు మళ్ళీ పెరట్లోకి నడిచాడు.

అతడు హఠాత్తుగా కనిపించగానే—స్నానానికి సిద్ధమైన సుశీల గబుక్కున పెరటిగోడమీది చీర మీదికి లాక్కుని, ముడుచుకు కూర్చుంది. సుందరం బొమ్మలా నిలబడిపోయాడు. తన నగ్న సౌందర్యాన్ని పూర్తిగా దాచుకోలేక మెలికలు తిరిగిపోతోంది సుశీల. అతడు ఆమె నున్నటి శరీరాన్ని, వయస్సు పొంగుల్ని, అంగాల వొంపుల్ని చూస్తూ నిలబడిపోయాడు.

సుశీల తల పైకెత్తింది. సిగ్గులో ఆమె ముఖం ఎర్రగా కందిపోతూవుంది. 'వెళ్ళిపో బావా!' అన్నట్టుగా వేడికోలుగా అతని కళ్ళలోకి చూసింది.

'చేతిరుమాలు వుతుక్కోవాలి' అన్నాడు సుందరం.

'నేను వుతికి పెడతాలే, వెళ్ళు!'

సుందరం కదలలేదు.

'అమ్మా!...' అంది సుశీల బిగ్గరగా.

అతడు చేతిరుమాలు ఆమెమీద పారేసి, అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు.

* * *

వాన వెలిసిన ఆకాశంలావున్న లేత నీలంరంగు చీర కట్టుకొంది సుశీల. తెల్లటి జాకెట్టు తొడుక్కుంది. కాటుకా బొట్టూ పెట్టుకుని, తలలో మల్లెపువ్వులు ముడుచుకొంది. ప్లాస్టిక్ సంచిలో కొబ్బరికాయ, పువ్వులు పెట్టుకొని 'వెడదాం రండిరా!' అంటూ వీధిలోకి వచ్చింది. ఆమె తమ్ముళ్ళు, చెల్లాయి అందరూ ఆమె వెంట బడ్డారు

సుశీలకు ఎదురుపడిన ఓ పొరుగింటి అమ్మాయి 'కోవెలకు వెళ్తున్నారా సుశీ?' అని అడిగింది.

'ఔను!'

'అంత సిగ్గేమిటే మీ బావకు? నువ్వు వెనక వస్తూంటే తాను ముందెళ్ళిపోతున్నాడేమిటి?' అంటూ నవ్వింది ఆ పిల్ల.

సుందరం చెరువుకట్టుమీదికెక్కి, వెనక్కి తిరిగి చూశాడు.

ఆకాశంలోనుంచి నేలకు దిగివచ్చే మెరుపు కన్నెలా నడిచి

వస్తోంది సుశీల అప్పుడే స్నానంచేసి సింగారించుకొన్న ఆమె-ఆకాశం లోని చుక్కలా మెరుస్తోంది.

వాళ్ళందరూ కట్టమీదికి వచ్చారు.

సుశీల నవ్వుతూ చేతి రుమాలు అతని కిచ్చింది. సుందరం దానిలో ముఖం తుడుచుకున్నాడు. పౌడరు వాసనతో ఘుమ ఘుమ లాడుతోంది రుమాలు.

అతడు సుశీల ప్రక్కగా నడుస్తున్నాడు. ఆమె తలలోని మల్లె పూలవాసన మత్తెక్కిస్తోంది. చెరువుమీదుగా వీస్తున్నగాలి జోరు హెచ్చింపింది. చెరువునీళ్ళు అలలు అలలుగా ఒడ్డును తాకుతున్నది. గాలిక ఆమె కురులు రేగుతున్నాయి. చీరె రెపరెపలాడుతూ కాళ్ళను ఆటకాయిస్తున్నది. కొంగు జెండాలా ఎగురుతోంది

'చీర కట్టుకుంటే నువ్వు మరీ బాగున్నావు సుశీ!' అన్నాడు సుందరం.

ఆమె కొంటెగా అతనివైపు చూచింది. మాట్లాడలేదు.

'మాటలురాని బొమ్మలా నోరు కదపవంటావేం?'

ఆమె పెదాలమీద వేలుంచుకుని, కళ్ళను పిల్లలవైపు తిప్పింది.

'మీరందరూ వీందుకొచ్చారా?' అన్నాడు సుందరం మంద లింపుగా.

'హాస్తే నీకేం?' అంటూ రాగం తీసింది సుబ్బులు.

అతడు దాని తలమీద మొట్టికాయ వేశాడు.

'చూడక్కా!'

చెరువుకు అవతలివైపున పచ్చని చెట్లనడుమ కోవెల కనిపి స్తోంది చెరువు నీటిలో ఆ చెట్లు ప్రతిబింబిస్తున్నాయి.

అందరూ కోవెల దగ్గరికి వచ్చారు.

కోవెల చాలా చిన్నది. కోవెలముందర ఓ చేదబావి వుంది. అక్కడ చేద్రతాడు, నొక్కుల బక్కెట్టు వున్నాయి. చుట్టూ పెద్ద పెద్ద మర్రిచెట్లున్నాయి. ఒక వారగా పొగడ చెట్టుంది. నేలమీద తెల్లని పొగడపూలు రాలి పడివున్నాయి పచ్చని పచ్చికమీద పొడుగాటి నీడలు పరచుకుంటున్నాయి. దేవళంముందరే ఎత్తైన రెండు రాతి స్తంభాలమధ్య ఇనుప గొలుసుల ఉయ్యాల వ్రేలాడుతున్నది.

బావిలోంచి నీళ్ళు చేది పాదాలు తడుపుకుని గుడిముందర నిలబడ్డారు వాళ్ళు. కొబ్బరికాయ కొట్టి, దండాలు పెట్టుకున్నారు.

'అక్కా! ఇంటికి యిప్పుడే ఎందుకే? కాస్సేపు యిక్కడేవుండి వెడదాం!' అన్నాడు కిరీటి.

'అలాగే! దెబ్బలాడుకోకుండా ఆడుకోవాలి మరి!'

పిల్లలంతా హోలోమంటూ ఉయ్యాల దగ్గరికి పరుగుతీశారు. సుశీల, సుందరం- యిద్దరుమాత్రం అక్కడ మిగిలారు అతడు ఆమె వైపు కొంటెగా చూశాడు. ఆమె ముఖం తిప్పుకొంది.

సుశీల మెల్లగా పొగడ చెట్టుక్రిందికి నడిచింది. రాలిన పువ్వులమీద కూర్చుంది. సుందరం ఆమె దగ్గరకు వెళ్ళాడు. దగ్గరగా కూర్చున్నాడు. చెట్లచాటున ఉయ్యాల కనిపించటంలేదు. పిల్లల కేరింతలుమాత్రం వినిపిస్తున్నాయి. పొగడ పువ్వుల వాసన మత్తు పుట్టిస్తోంది.

'సుశీ!' అన్నాడు సుందరం.

ఆమె మాట్లాడలేదు. చేతికి అందుబాటులోవున్న పువ్వుల్ని ఏరి కుప్పపెడుతోంది.

'ఇలా చూడవూ?'

సుశీల తలవొంచుకుని నన్నగా నవ్వుతూ 'నేను అలిగినాను!' అంది అందంగా.

'బాగుంది! ఇలా నీ కోపమంతా చూపించటానికేనా ఇంత ఇంతదూరం తీసుకొచ్చావు? ఎందుకూ అలక?'

'నువ్వు మంచివాడివి కావు!'

'ఏం చేశాను?'

'నన్నుమర్చి మరిచిపోయావు.'

'ఇప్పుడొచ్చా నుగా!'

'రాకుండావుంటే ఏమయ్యేదో తెలుసా?'

'ఏమయ్యేది?'

సుశీల జవాబు చెప్పలేదు.

'ఏవో పెళ్ళి సంబంధాలొచ్చాయటగా?' అన్నాడు సుందరం.

'ఊఁ! ఆ సంబంధాలకు అమ్మ ఒప్పుకోలేదు.'

'అమ్మ ఒప్పుకునేదేమిటి? పెళ్ళి చేసుకునేది నువ్వుకదా?'

'అమ్మ నాలిక నాదే బావా!'

సుందరం సంతృప్తిగా నవ్వుతూ ఆమె కళ్ళలోకి చూశాడు కళ్ళతోనే వెక్కిరించిందామె.

'సుశీ నీకు ఉద్యోగం చెయ్యాలనిలేదూ?'

'చదువుకున్న ఆడపిల్ల ఉద్యోగానికి తప్పితే మరెందుకూ పనికి రాదనా బావా, నీ అభిప్రాయం? నేను ఉద్యోగం చెయ్యను. నా పని నేను చేసుకుంటాను.'

'ఏం పని?'

'వంటపని!...ఆడవానికి ఉద్యోగంలోకంటే — అలిసిపోయి యింటికొచ్చిన భర్తకు చప్పున కాఫీ అందించడంలో ఎక్కువ సుఖం వుంటుందికదూ?'

'నన్నడుగుతావేం? నేను ఆడదాన్నా?'

సుశీల మూతి ముడుచుకుంది.

'ఔను! నువ్వు ఆడదానివే! నీకు మీసాల్లేవు!' అంటూ నవ్వింది.

సూర్యుడు అస్తమించాడు. ఆకాశం ఎర్రబడుతోంది. మర్రి చెట్లలో చిలకలు కీచుకీచు మంటున్నాయి కాకులు గోలగా అరుస్తున్నాయి.

'సుశీ! నీకో సంగతి జ్ఞాపకం వుందా?'

'ఏమిటి ?'

'మనం చిన్నప్పుడు గడ్డికోసం యిక్కడికొచ్చాం. నువ్వు నన్ను తిట్టావు. అప్పుడు నేనో పని చేశాను, గుర్తుందా?'

'ఏం చేశావేమిటి?'

'చెప్పమంటావా?'

'ఊహూఁ! చెప్పొద్దులే!' ఆమె కళ్ళు సిగ్గుతో క్రిందికి వాలాయి.

'పోనీ, చెబుతాలే! నిన్ను గట్టిగా పట్టుకుని ముద్దు పెట్టుకున్నాను.'

'ఛీ! పచ్చి అబద్ధం!'

'అబద్ధంకాదు. నిజం!'

'ఏమో! నాకు జ్ఞాపకంలేదు నువ్వు అబద్ధాలాడుతున్నావు.'

సుందరం ఆమెను గట్టిగా కౌగిలించుకుని, బుగ్గమీద ముద్దు పెట్టుకున్నాడు. 'ఇదికూడా అబద్ధమేనా?'

సుశీల అతని కౌగిలి విడిపించుకుని, నవ్వుతూ లేచి పరుగెత్తింది. ఉయ్యాల ఊగుతున్న పిల్లల దగ్గర ఆగి 'ఇంటికి పోదాం పదండిరా!' అంది.

సుందరం వాళ్ళను కలుసుకున్నాడు.

సుశీల బుంగమూతి పెట్టింది. 'పో బావా! ఆ బుద్ధింకా పోలేదు నీకు!'

* * *

ఆ రాత్రి భజనమందిరం దగ్గర బుర్రకథ చెప్పబోతున్నారు

శాంతమ్మ పెందరాళే అందరికీ భోజనాలు వడ్డించింది.

'ఉదయం నేను వెళ్ళిపోతానత్తయ్యా!' అన్నాడు సుందరం

'అదేమిటి సుందరం ? రేపు సెలవు పెట్టలేదూ ?

'లేదు.'

సుశీల అతనివైపు చూచి చిరుకోపాన్ని ప్రదర్శించింది. ఆమెకు సంజాయిషీ చెబుతున్నట్టుగా సెలవులన్నీ యిప్పుడే వాడేసుకోవడం ఎందుకత్తయ్యా? ముందు ముందు అవసరం వుంటుందిగా?' అన్నాడతను.

సుశీల మూతి విరిచింది.

భోజనాలైన తరువాత పిల్లలంతా భజన గుడివద్దకు పరుగుతీశారు. సీతయ్య అంతకుముందే వెళ్ళిపోయాడు.

'అందరూ వెళ్ళిపోయారే! సుందరం! నువ్వుకూడా వస్తావా, బుర్రకథ వినటానికి?' అంది శాంతమ్మ

'వస్తానత్తయ్యా!'

అత్తా, అల్లుడూ యిద్దరూ వీధిలోకి వచ్చారు.

'ఒసే సుశీ! వచ్చేటప్పుడు ఇంటికి తాళం వేసుకురా! అలాగే-మీ బావ పడుకోటానికి మంచం మీద పరుపువేసేసిరా!'

సుశీల తలుపు తాళం వేసుకుని, వాళ్ళ వెనకే నడిచింది.

అందరూ వెళ్ళి భజనగుడి ముందర ఓ కంటి అరుగుమీద కూర్చున్నారు. బుర్రకథ వినటంకోసం జనం అప్పటికే గుమి గూడారు.

కథ ప్రారంభమైంది. దేశింగురాజు కథ చెబుతున్నారు.

పల్లెజనం చలికి దుప్పట్లు కప్పుకుని కుతూహలంగా కథ వింటున్నారు. ఆడవాళ్ళు కొందరు అప్పుడప్పుడూ సుశీలను, సుందరాన్నీ చిత్రంగా చూస్తున్నారు. తాను కొత్త పెళ్ళికొడుకైనట్టు, సుశీల కొత్త పెళ్ళికూతురైనట్టు సిగ్గుపడ్డాడు సుందరం.

కథ సగానికి వచ్చింది. సుశీల ఆవలించింది. ఆమె కళ్ళు నిద్రతో మూరుకుపోతున్నాయి. అరుగుమీదనుంచి క్రిందికి దిగింది.

'అమ్మా! నిద్దరొస్తోంది. నేను వెళ్తానే!' అంది

శాంతమ్మకు ఆమాటలు వినబడలేదు. ఆమె కథలో లీనమై పోయివుంది.

సుశీల ఇంటికి వెళ్ళిపోయింది.

సుందరం మరికాస్సేపు కూర్చున్నాడు. చలివేస్తూవుంది.

అతని మనస్సు కథమీద నిలవటంలేదు. అంతసేపూ సుశీల ఆ అరుగు మీద కూర్చున్నది గనుక, తానూ హాయిగా కూర్చోగలిగాడు. ఆమె లేచి వెళ్ళిపోయింది. కనుక బుర్రకథ ఇప్పుడు బాగాలేదు.

'అత్తయ్యా?...'

'ఏం సుందరం?'

'వెళ్ళి పడుకుంటాను.'

'నిద్దరొస్తోందా?...పడుకోపో!'

సుందరం ఇంటికి వెళ్ళాడు.

దగ్గరగా వేసివున్న తలుపును మెల్లగా త్రోశాడు. చాపమీద సుశీల పడుకుని వుంది. ఆమె ముఖం అటువైపుగా వుంది. తలలోని మల్లెలు తలగడను ముద్దుపెట్టుకుంటున్నాయి. తలుపు చప్పుడు విని ఆమె ముఖం యిటు తిప్పింది. ఆమె చూపులు అతని చూపులలో కలుసుకున్నాయి.

ఆమె లేచి కూర్చుంది. అతను ఎదుట నిలబడి వున్నాడు.

ఆమె కురుల నలుపు, కళ్ళలోని తెలుపు, కనుపాపల్లోని నీలిమ, బుగ్గలమీది ఎరుపు...ఆహా! రంగులు ధన్యమైనాయి!

అతని చూపుల వాడుకు తట్టుకోలేక సిగ్గుతో తలవంచుకుంది సుశీల. ఇద్దరూ మాట్లాడటం లేదు. చలిరేయి! పరస్పరం మనసారా ప్రేమించుకున్న యువతీ యువకులు! ఏకాంతం!... మాటలతో అవసరమేముంది? మనస్సులు మాట్లాడగలిగినప్పుడు, మనసులు వినగలిగినప్పుడు-నోటిమాటలతో పనేముంది? అతని మనస్సులోని భావాలు గ్రహించి, ఆమె సిగ్గుపడి తలొంచుకుంది.

సుందరం 'సుశీ!' అన్నాడు. ఆ పిలుపు శబ్దరూపాన్ని ధరించలేదు. అతని పెదవులు మాత్రం వణికాయి.

అతడు ఆమె చెంతకు నడిచాడు. సరసన కూర్చున్నాడు. మీదికి వంగి, చెక్కిలి మీద మెత్తగా ముద్దుపెట్టుకున్నాడు, ఆమె చేతుల్లో ముఖం దాచుకుంది. అతడు ఆమెను దగ్గరకు తీసుకున్నాడు ముఖాన్ని అతని గుండెల్లో దాచుకుందామె. సుందరం ఆమెను బిగియార కౌగిలించుకున్నాడు. అతని మనస్సు అనిర్వచనీయమైన ఆనందంతో ఉయ్యాలలూగింది. తన కౌగిట్లోవున్న సుశీలతో బాటుగా చాపమీదికి వాలాడు.

సరిగ్గా ఆ క్షణంలో తలుపు భళ్ళున తెరుచుకొంది. తలుపు నెట్టిన వాడెవడు? జానకీపతి!

సుందరం కంగారుపడి దూరంగా జరిగాడు లేచి మంచం మీద కూర్చున్నాడు. సుశీల చీర కుచ్చిళ్ళు సవరించుకుని, మోకాళ్ళ మీద గడ్డం ఆనించి, సిగ్గుగా జానకీపతిని చూస్తూ కూర్చుంది.

వాడు గుమ్మంలోనే నిలబడిపోయాడు. ఇంట్లోకి రావాలో, వీధిలోకి వెళ్ళాలో తోచక సందేహిస్తున్నాడు.

సుశీల వాణ్ణి చూచి నవ్వింది ఆమె ముఖం చెప్పరానంత సిగ్గులో మునిగిపోయింది. జానకీపతి వీధిలోకి వెళ్ళబోయాడు.

'జానకీ! ఇలారాబాబూ!' అని పిలిచింది సుశీల, ఎంతో ప్రేమగా.

వాడు జంకుతూ నిలబడ్డాడు.

'రా నాన్నా!'

వాడు ఆమెదగ్గరకు వచ్చాడు ఆమె వాడిచెయ్యి పట్టుకుని,

తనపైన కూర్చోబెట్టుకుంది. గారాబుగా వాడితల నిమురుతూ 'నిద్దరొస్తోందా నాన్నా ?' అంది.

ఔనన్నట్లు తల వూపాడు వాడు.

'పడుకుని నిద్రపోమరి ! మళ్ళీ ఎక్కడికి పోతావెందుకూ?... బుర్రకథ ఏమీ బాగాలేదు కదూ ?'

'ఊఁ!'

'మా మంచి తమ్ముడు !' అంటూ వాడి చెంపమీద ముద్దు పెట్టింది సుశీల. వాణ్ణి చాపమీద పడుకోబెట్టింది. తను వాడి పక్కన పడుకుంది. వాడిమీద చెయ్యివేసి జోకొట్ట సాగింది.

సుందరం మంచంమీద పడుకున్నాడు.

'వాడు సుశీల పక్కన ఎంత బాగా పడుకున్నాడు! ఆమె ఒంటిని కరుచుకొని పడుకున్నాడు. నేను కూడా సుశీల తమ్ముడుగా వుట్టివుంటే అలా పడుకోవచ్చు! ఆ చల్లటి కౌగిట్లో హాయిగా నిద్రపోవచ్చు ఎవ్వరూ ఏమీ అనుకోరు.'

సుశీ !' అన్నాడతను.

ఆమె కళ్ళు పైకెత్తి అతనివైపు చూచింది.

'నిద్రపోయాడా ?'

'లేదు!'

'నాకు తెలుసులే! నిద్రపోయాడు.'

అతడామె కళ్ళలోకి ఆశగా చూశాడు.

'ఛీ!'

ప్రాధేయపడుతున్నట్లు చూశాడు.

ఆమె తలగడలో ముఖం దాచుకుని 'వద్దు బావా!' అంది.

సుందరం పైకి లేచాడు.

బయట. శాంతమ్మ గొంతు వినిపించింది.

సుందరం మళ్ళీ మంచంమీద పడుకుని ముసుగుతన్నాడు.

సుశీల గబుక్కున కళ్ళు మూసుకుంది.

★ ★ ★

ఉదయం పెందరాళే లేచి కాలకృత్యాలు ముగించుకొన్నాడు సుందరం. అద్దంముందు నిలబడి తల దువ్వుకుంటున్నాడు.

సుశీల అతనికి కాఫీ తెచ్చింది.

గోడమీద సుశీల ఫోటో ఒకటుంది. రొమ్ముల దాకా తీయించు కున్న కార్డు సైజు ఫోటో! దాన్ని దొంగిలించుకు పోవాలని క్రితం రోజునుంచి అనుకుంటున్నాడతను. అందరి ఎదుటా తీసుకుంటే వద్దనరుగానీ, తనకు ప్రియమైన వస్తువును దొంగిలించుకు పోవటంలోనే మాధుర్యం వుంది. శ్రీకృష్ణుడు రుక్మిణిని దొంగిలించుకు పోలేదూ?

సుశీల చూస్తూవుండగా ఆ ఫోటోను తీసి సంచిలో పెట్టు కున్నాడు సుందరం. సుశీల నవ్వుతూ అతనికి కాఫీ అందించింది.

సుందరం బయలుదేరడానికి సిద్ధమయ్యాడు.

'వెళ్ళొస్తా అత్తయ్యా!'

'వెళ్ళిరా సుందరం!...అక్కను అడిగానని చెప్పు!...మళ్ళీ ఎప్పుడొస్తావు?'

'వస్తాలే ఎప్పుడైనా!...వెళ్ళొస్తా సుశీ!'

'ఊఁ!'

ఆమె ముఖం దీనంగా వుంది. పెదవులు ముడుచుకున్నాయి. కళ్ళు రెపరెప లాడాయి.

సుందరం బయలుదేరాడు.

అతని మనస్సు తేలికగా వుంది. భారంగా కూడా వుంది.

కట్టమీద నడుస్తూవుంటే, క్రిందటిరోజు సంఘటనలన్నీ వరు సగా జ్ఞాపకం వస్తున్నాయి. ఆ జ్ఞాపకాలు ఎంతో మధురంగా వున్నాయి.

'సుశీల నన్నెంత గాఢంగా ప్రేమిస్తోంది! నన్నే స్మరిస్తు న్నట్టుగా, నా కోసమే ఎదురు చూస్తున్నట్లుగా మాట్లాడింది. అంతటి ప్రేమను పొందుకోవడం నిజంగా నా భాగ్యం!...ఆమె నన్ను ప్రేమిస్తున్నట్టుగా నేనామెను ప్రేమిస్తున్నానా?...ఎందుకు ప్రేమిం చడంలేదూ? బ్రతికితే-నేనూ, సుశీల ఇద్దరం కలిసి బ్రతకాలి! లేకుంటే ఇద్దరం ఈ లోకంలో లేకుండానైనా పోవాలి!'

అతను చెరువు కట్టదిగి కాలిబాటలో నడుస్తున్నాడు.

సుశీల వాడిన ముఖం ఇంకా అతని కళ్ళకు కట్టినట్లుంది. ఆమె పెదవులు మొగ్గల్లా ముడుచుకున్నాయి. కళ్ళలో కన్నీళ్ళు తొంగి

చూచాయి. ఆమె మనస్సు లతని చెవిలో గుసగుస లాడుతున్నది.

'నన్నొదిలి వెళ్ళిపోతున్నావా బావా? మళ్ళీ వస్తావనే ఆశ వున్నా, మనం ఒక్కటిగా వుంటామనే నమ్మకం వున్నా, నువ్వు వెళ్ళిపోవడం ఎంత బాధాకరంగా వుంది! ... ఎంత తియ్యని రోజు! ఒక్కరోజు! ఎంతో దయగల రోజు! నా మనసులో మల్లెలు పూయించి, ఒడిలో ఆశలుపోసిన రోజు! నా మనసులో పన్నీరుచల్లి, నా పసుపుదనం మీద తొలకరి కురిపించినరోజు! నా స్వప్న సుందరుడివి— నిన్ను నా పూజామందిరంలోకి తీసుకొచ్చి, ఆ ఉచ్చస్థితిని మళ్ళీ కలలాగా కరిగించివేసి, నీకూ నాకూ మధ్యపదిహేను మైళ్ళ దళసరి గాలిగోడను నిర్మిస్తున్న రోజా!...ఇది ఎంతో క్రూరమైన రోజుకూడా! సుతిమెత్తని వలపు గుండెలతో చెలగాటాలాడే రోజు...ఆదివారం మళ్ళీ ఎప్పుడొస్తుంది బావా ?'

'ఆదివారం రోజూ రాదు సుశీ! ఆరుదినాలు కష్టపడి పని చేయాలి! పేగులు తెగిపోయేటట్లు అరవాలి. గొంతు చిరిగిపోయేటట్లు పాఠాలు చెప్పాలి. మెదడు కరిగిపోయేటట్లు పలకలూ, కాగితాలూ దిద్దాలి. ఏడోదినం విశ్రాంతి దినం!...అదే! రోడ్డుమీద బస్సు ఆగింది. ఆదివారంలాగా ఈ బస్సుకూడా నయవంచకి! నన్ను ఎలా తీసుకొచ్చిందో, అలాగే తీసుకెళ్ళిపోతోంది. సుశీ! వెళ్ళిరానా?'

'వెళ్ళిరా బావా!'

'ఆ కన్నీళ్ళెందుకూ? నవ్వుతూ చెప్పాలి! ఏదీ...నవ్వూ!'

'... ... ...'

'అదీ!...టాటా!'

'బైబై!'

సుందరం బస్సెక్కాడు.

* * *

# 6

ఆరోజు మహాశివరాత్రి!

పొద్దుగూకిన కాసేపటికి భోజనంచేసి, రామలింగం కోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు సుందరం.

చిన్నప్పుడు తాను అత్తయ్యవాళ్ళ వూళ్ళో గడిపిన మహాశివరాత్రి గుర్తుకొచ్చిందతనికి. ఇంట్లో అందరూ ఆరాత్రి జాగారం చేశారు. పొరుగిళ్ళ లమ్మలక్కలందరూ పోగయ్యారు. కథలూ కబుర్లూ చెప్పుకున్నారు. పిల్లలంతా వీధుల్లో కేకలు పెడుతూ, పరుగెడుతూ ఆటలాడుకున్నారు. అవకాశం కోసం ఎదురుచూచే కన్నెపిల్లలు, కోడెవయసు కుర్రవాళ్ళు కూడా చిన్నపిల్లల ఆటల్లో కలుసుకున్నారు. చీకట్లలో, నీడల్లో ఒదిగి నుంచునే ఆడపిల్లల చేతి గాజుల చప్పుడు, సన్నటి దగ్గులు వినడానికెంతో సొంపుగా వుంటాయి!

సాయంకాలం తనకు రామలింగం కనిపించాడు. 'ఒరే సుందరం! ఈ రాత్రి బాటగంగమ్మ తిరణాలకు వెడదాం, వస్తావ్రా?' అన్నాడు.

ఆవూరికి ఐదుమైళ్ళ దూరాన–బాటపక్కన ఓచిన్న గుడి వుంది. ఆ గుడిలోవున్న దేవతపేరు బాటగంగమ్మ. ఆ పరిసర ప్రాంతాల పల్లె ప్రజలకు ఆదేవతపట్ల మంచి గురివుంది. అక్కడ పెళ్ళిళ్ళు జరుగుతుంటాయి. మొక్కుబడులు చెల్లింపబడుతూ వుంటాయి. జంతుబలులు కూడా జరుగుతాయి.

ప్రతి మహాశివరాత్రికి అక్కడ ఉత్సవం జరుగుతుంది. ఆ గుడిప్రక్కనున్న పది ఎకరాల విస్తీర్ణంలో—అప్పుడు రకరకాల దుకాణాలు పైకిలేస్తాయి. రాత్రి తెల్లవార్లూ రకరకాల వేడుకలు జరుగుతాయి. ఆ ఉత్సవం చూడటానికి—పల్లెపల్లెలనుండి లెక్కలేనంత మంది జనం వస్తారు.

తాను నాలుగేళ్ళక్రిందట ఎప్పుడో ఓసారి ఆ ఉత్సవానికి వెళ్ళాడు. తరువాత వెళ్ళలేదు.

'రాత్రంతా నిద్రమేలుకోవడం ఎలా రామలింగం? పడుకోవాలంటే, అక్కడ చోటెక్కడుంది? తెల్లవారేదాకా అక్కడుంటే చలికి ఒళ్ళు కొంకర్లుపోదా?' అన్నాడు.

'ఎందుకురా? నేనున్నానుగా!...అక్కడ పల్లెలో నాకు తెలిసిన వాళ్ళున్నారులే!...మరేమీ ఇబ్బంది వుండదు.'

'సరే, అలాగే వెళ్దాం!' అన్నాడు తాను.

'త్వరగా భోంచేసి రెడీగా వుండు. నేనే వచ్చి పిలుస్తాను. ఇద్దరం కలిసి వెళ్దాం!' అన్నాడు రామలింగం.

అతను యింకా రాలేదు.

సుందరం - గోడమీదున్న సుశీల ఫోటోలోకి చూస్తూ కూర్చున్నాడు:

అతడు ఆ ఫోటోను తన తల్లికి చూపటానికి సిగ్గుపడి, దాన్ని మేజా సొరుగులో దాచుకుని చాటుగా చూసుకుంటూ రెండు రోజులు వెళ్ళబుచ్చాడు. మూడో రోజున సొరుగులో ఆ ఫొటో కని పించలేదు. అతడు పుస్తకాలంతా వెతుక్కుంటూవుంటే 'ఆ గోడకు తగిలించానురా!' అంది రాజమ్మ...

'సుందరం!'

బయట కేక వినిపించింది. సైకిలుగంట మోగింది.

రామలింగం వచ్చాడు.

'వెళ్దాం రారా!'

సుందరం పైకి లేచాడు. 'అమ్మా! వెళ్ళొస్తానే!' అన్నాడు.

'భద్రం నాయనా! చీకట్లో ఎక్కడా తిరక్కు!' అంది రాజమ్మ.

సుందరం, రామలింగం—వీధిలోకి వచ్చారు, వాకిట్లో నిలబెట్టి వున్న సైకిలుస్టాండు తీసి, ముందుకు నెట్టాడు రామలింగం.

'టైమెంతయిందిరా సుందరం?'

'ఎనిమిదిన్నర!'

రామలింగం సైకిలుమీద ఎక్కి కూర్చున్నాడు.

సుందరం వెనకసీట్లో కూర్చున్నాడు.

సైకిలు సందుగొందులన్నీ తిరిగి, ఊరు దాటుకొంది.

చల్లగా గాలి వీస్తూవుంది.

అమావాస్యకు ముందురోజు. ఆకాశం నల్లగా వుంది. రోడ్డు రోడ్డు ప్రక్కనున్న చెట్లు, దూరంగా వున్న కొండలు—అన్నీ నల్లగానే వున్నాయి. అప్పుడప్పుడూ ఆకాశపు అంచులు అస్పష్టంగా వురుముతున్నాయి. దిక్కుల చివర సన్నగా మెరుపు మెరిసినప్పుడు మాత్రం—ఆరిపోతున్న అగ్గిపుల్ల వెలుతుర్లో కనిపించే రాతిబండల్లాగా — ఆకాశంలో దొర్లుతూన్న బూడిదరంగు మేఘాలు కనిపిస్తున్నాయి.

'వర్షం వస్తుందా రామలింగం?'

'రావొచ్చు!'

'అప్పుడే చలివేస్తూ వుంది.'

'అక్కడికి వెళ్ళాక, చలీ గిలీ ఏమీ వుండవులేరా!'

రామలింగం సైకిలు తొక్కుతూ సిగరెట్టు తాగుతున్నాడు. సిగరెట్టుపొగ సుందరం ముఖంమీదుగా, వెనక్కు దూసుకుపోతున్నది. సైకిలు లైటునుంచి రోడ్డుమీదికి ప్రసరిస్తున్న గుడ్డి వెలుతురు వెంబడే చక్రాలు జర్రున ముందుకు దొర్లిపోతున్నాయి. చీకటిలో ఫర్లాంగురాళ్ళు, మైలురాళ్ళూ వెనక్కి పరిగెత్తి పోతున్నాయి.

రామలింగం హఠాత్తుగా సైకిలు ఆపి, పాదం నేలమీద మోపాడు.

'దిగురా!'

ఇక్కడెందుకూ—అనబోయాడు సుందరం. అయితే ఆ మాట అనలేదు. అతనికీ దిగాలనే వుంది. ఇనప కమ్మల సీటుమీద కదలక మెదలక కూర్చున్నందున తొడలు నొక్కుకుపోయి, కాళ్ళు తిమ్మిరెక్కి పోతున్నాయి. సుందరం క్రిందికి దిగి, తొడలు నలుపుకున్నాడు. కాళ్ళు జాడించుకున్నాడు.

ఓ అరమైలుదూరాన—రోడ్డుచివర విద్యుద్దీపాల కాంతిపుంజం విసనగ్రరలాగా కనిపిస్తోంది. జన సమూహపు రణగొణ ధ్వనులు తెరలుతెరలుగా తేలివస్తున్నాయి.

రోడ్డు ప్రక్కన నల్లత్రాచులా వంపులు తిరిగిన సన్నటి కాలి బాటవుంది. రామలింగం సైకిలుతోసుకుంటూ ఆ కాలి బాటలోకి నడిచాడు.

'ఇటెక్కడికిరా ?' అన్నాడు సుందరం.

'ఆ పల్లెలో సైకిలు పెట్టేసి వద్దాంరా'

పల్లె కనిపించటంలేదు. ఆకాశంనుండి నేలమీదికి నల్లతెర దించినట్లుగావుంది.దూరాన ఓ గుడ్డిదీపం మాత్రం మినుకు మినుకు మంటోంది.

'అదేనా ?'

'ఔను !'

చీకట్లో ఓ ఫర్లాంగుదూరం నడిచి, ఇద్దరూ పల్లెలోకి వచ్చారు. రామలింగం ఓ పూరింటిముందు సైకిలు ఆపాడు. మెల్లగా తలుపు నెట్టాడు.

'ఎవరూ ?' అంది ఓ ముసలావిడ.

'నేనమ్మా!...వెంకట్రాయులు లేడూ ?'

ముసలామె దగ్గరగా వచ్చి అతని ముఖంలోకి తొంగిచూచింది.

'నువ్వా నాయనా ?...వాడులేడే ! తిరణాలకెళ్ళాడు.'

'నేనూ అక్కడికే వెళ్తున్నాను. ఈ సైకిలు కాస్త లోపల పెట్టి పోతాను.' అంటూ సైకిలు లోపల పెట్టి బయటకు వచ్చాడు రామలింగం. ముందుకు నడిచాడు. ఓ గుడిసెముందు ఆగాడు.

లోపల బుడ్డి దీపం వెలుగుతోంది. సారా వాసన గుప్పు మంది. గుడిసెకు కాస్త దూరంగా నలుగురు మనుషులు బీడీలు కాలుస్తూ చీకట్లో దొంగల్లా నిలబడ్డారు. ఓ మనిషి తూలుతూ వీధిలో వెళ్తున్నాడు. చిత్ర విచిత్రంగా గొంతు మార్చుతూ పాట పాడుతున్నాడు.

'ఇక్కడే వుండు సుందరం ! ఇప్పుడే వచ్చేస్తాను.' అంటూ గుడిసెలోపలికి వెళ్ళాడు రామలింగం. ఓ నిమిషం తర్వాత జేబు రుమాలుతో పెదాలు తుడుచుకుంటూ, గుక్కిళ్ళు మింగుతూ, చిన్నగా దగ్గుతూ బయటకు వచ్చాడు. 'పదరా !' అన్నాడు.

'ఇదెప్పట్నుంచిరా ?' అన్నాడు సుందరం.

'అప్పే ..ఏదో కొద్దిగా...' అంటూ నవ్వాడు రామలింగం.

సుందరం ముఖం చిన్నబుచ్చుకున్నాడు.

ఇద్దరూ నడుస్తున్నారు. రామలింగం చాలా హుషారుగా వున్నాడు. అతడు తాగినట్లే కనిపించటంలేదు. మనిషి పూర్తిగా స్వాధీనంలోనే వున్నాడు. సుందరానికైనా గతుకుల్లో కాళ్ళు జారు తున్నాయిగానీ, అతను జాగ్రత్తగానే నడుస్తున్నాడు 'సారాను బాగా లొంగదీసుకున్న మనిషిలా వున్నాడు !' అనుకున్నాడు సుందరం.

'తాగుడు మానెయ్యరా ఫూల్' అనలేదతను.

అలాంటి జోడి సలహావల్ల ప్రయోజనం ఏముంది? తాగుడు మంచిది దని అతనికి తెలియదా ? మిత్రుని హితబోధ తాగుబోతు కెక్కదు. తాగుబోతుకు మిత్రం తాగుడేకదా ? ? చచ్చేంతవరకు అది వెర్రి విడువదు వాడు దాని మానేవింటాడు. అదే న్యాయం!

సుందరం కాళ్ళు బలవంతంగా ముందుకు సాగుతున్నాయి. వేడుకలు చూడటానికి బయలుదేరదీసిన అతని ఉత్సాహం రామలింగం చేసిన పనివల్ల సగం చల్లారిపోయింది.

ఇద్దరూ రోడ్డు వెంబడే నడిచి బాటగంగమ్మ గుడి వద్దకు చేరుకున్నారు. గుడిలోపల, బయట విద్యుద్దీపాలు వెలుగుతున్నాయి. గుడిముందర కొబ్బరి ఆకులతో పెద్ద పందిరి వేశారు. పందిరి జనంతో క్రిక్కిరిసి పోయింది. గుడిచుట్టూ వున్న విశాలమైన ఆవరణలో—లెక్కపెట్టడానికి వీలుకానన్ని దుకాణాలు బారులు తీరాయి. టీ దుకాణాల్లో—బాయిలర్లలోంచి పొగలు, కాగుతున్న పెనంలోంచి ఆవిర్లు పైకిలేస్తున్నాయి. క్రిక్కిరిసిన జనంలో—బీడీలు, సిగరెట్లు మిణుగురు పురుగుల్లా మినుకు మినుకు మంటున్నాయి. నేలమీద పాలిన పొడుగాటి గుంజంమీదుగా సరఫరా చేయబడిన విద్యుచ్ఛక్తి ఆ ప్రదేశాన్ని వెలుగుల్లో ముంచెత్తుతూ వుంది. వాన నీళ్ళతో నిండి పొర్లివచ్చే కొండ వాగుల్లాగా—అన్ని దిక్కులనుండీ జనం నిర్విరామంగా వస్తున్నారు. కొండ కోనల నడుమనున్న సరోవరంలాగా ఆ ప్రదేశం జన సమూహంతో నిండిపోతోంది.

కనుచూపు దూరంలో రోడ్డుమీద దివిటీలు గాలిలో రెప రెపలాడుతూ వస్తున్నాయి. తప్పెట్లు వాయిస్తూ, కత్తులు ఊపుతూ ఓ గుంపు కోలాహలంగా వస్తోంది.

ఉత్సవ ప్రాంతం పక్కగా పోతున్న తారురోడ్డుమీద ఓ ఫర్లాంగు మేరకు మసకగా వెలుగులు ప్రసరిస్తున్నాయి. రోడ్డు వారగా రెండెడ్లబండ్లు వరుసగా బారులుతీరి నిలబడ్డాయి. నేలమీద పడుకున్న ఎడ్లు తీరిగ్గా నెమరు వేస్తున్నాయి.

రామలింగం సిగరెట్టు నోటపెట్టుకుని, ఖాళీ ప్యాకెట్టు క్రిందికి విసిరేశాడు. గీచిన చివరి అగ్గిపుల్ల గాలికి ఆరి పోయింది. అతడు ఓ కొట్లో సిగరెట్టు ప్యాకెట్టు, అగ్గిపెట్టె కొనుక్కున్నాడు. 'లోపలికి పోదాం రారా!' అన్నాడు.

జనంలో దారి చేసుకుంటూ యిద్దరూ దుకాణం ప్రక్కగా నడుస్తున్నారు. ఎంత జనం! అడుగు మోపడానికి తావులేదు. కదిలేందుకు సందులేదు. వానపబ్బుల్లా మందగమనంతో నడుస్తున్నారు ప్రపంచమంతా ప్రతి అంగుళం మేరలోనూ యిలా నిండివుంటే, ఆ ప్రజలు కెలా వుంటుంది? అసలు తాను యింటినుండి బయటికి వెళ్ళడానికి ఎంతకాలం పడుతుంది? ఉదయం బయలుదేరితే సాయంకాలానికల్లా చేరుకోవచ్చు ఇంత ఆలస్యమేమిటని హెడ్మాష్టరుగారు కేకలు

వెయ్యరూ?...ఫరవాలేదు ఆయన తనకంటే ఆరోగ్యంగా వస్తాడేమో!

సుందరం, రామలింగం అన్నిచోట్లా తిరిగారు.

రామలింగం కళ్ళు ఎవరినో వెదుకుతూన్నట్లున్నాయి. చూపులు ప్రసరించేటంతమేర నిశితంగా పరిశీలిస్తున్నాడు. చిరాకు పడుతున్నాడు.

'ఎవరికోసంరా?' అన్నాడు సుందరం.

'చెబుతాలే!'

కొప్పునిండా పువ్వులు పెట్టుకుని, రంగురంగుల బట్టలు కట్టుకుని తిరుగుతున్నారు పడుచుపిల్లలు. పౌడరు వాసనలు గుప్పుమంటున్నాయి తలలో పువ్వులు నలిగిపోతున్నాయి.

తలకు ఆముదం పెట్టి దువ్వుకుని, చేమంతిపూలు ముడుచుకున్న ఓ నల్లటి జవ్వని సుందరంముందు నడుస్తున్నది. ఆమె ఒంటికి తగలకుండా వుండాలనే ప్రయత్నంలో అతని కాళ్ళు నలిగిపోతున్నాయి. ఆ గుంపులో ఎవడో తుంటరివాడు ఆమెను ఏదో చేశాడు. ఆమె కోపంతో తిడుతూ వెనక్కి తిరిగి, సుందరానికి ఢీకొన్నది. ఒక్కక్షణం బిత్తరపోయి, పకాలున నవ్వి, ప్రక్కకు తప్పుకొన్నది. ఆమె బుగ్గనిండా తాంబూలం వున్నది. నవ్విన పెదాలు ఎర్రగా వున్నాయి. తమలపాకులవల్ల ఆ పెదాలు ఎర్రబడ్డాయో, ఆ పెదవులవల్ల తమలపాకులు ఎర్రబడ్డాయో, తెలియడంలేదు. సుందరం తన షాలీవైపు చూసుకున్నాడు. తెల్లటి చొక్కామీద ఎర్రటి ముద్రలు పడ్డాయి. ఆమె ఆ ముద్రలవైపు ఓరచూపు చూసింది. అతడు ముఖం తిప్పుకున్నాడు.

రామలింగం పక్కీ రోడ్డుమీదికి వచ్చాడు. లాభంలేదన్నట్టు నోరు చప్పరించాడు. 'ఆడదాన్ని నమ్మకూడదు!' అన్నాడు.

ఇద్దరూ ఓ కొట్లోకి దూరి, టీ త్రాగారు.

దూరంగా రంగులరాట్నం పైకీ, క్రిందికీ గిర్రున తిరుగుతోంది

రామలింగం సుందరం చెయ్యిపట్టుకుని లాగుతూ గబగబా రంగులరాట్నం దగ్గరికి నడిచాడు. అతని ముఖంలో మెరుపు మెరిసింది.

తిరుగుతున్న రంగులరాట్నం ఆగింది అందులో కూర్చున్న మనుషులు క్రిందికి దిగారు. తిరగటానికి మోజుపడుతున్నవాళ్ళు తొట్లలో ఎక్కికూర్చుంటున్నారు వాళ్ళలో కొందరు స్త్రీలుకూడా వున్నారు,

రామలింగం సుందరం చెయ్యి పట్టుకు లాగాడు, 'మనం కూడా తిరుగుదాం రారా!'

సుందరం వెనకాడాడు, 'నేనెందుకులే రామలింగం? నువ్వెళ్ళి కూర్చో! నేను నిలబడి చూస్తావుంటాగా!'

రామలింగంలో వున్న కైపంతా అప్పుడు బయటపడింది. అతని దాలు వికారంగా వంకరలతిరిగాయి. చెయ్యి గట్టిగా పట్టుకుని 'అడ్డు చెప్పకుండా రావోయ్!' అంటూ గుంజాడు.

ఇద్దరూ నెప్పి ఓ ఉయ్యాల్లో కూర్చున్నారు. రామలింగం చిన్నగా దగ్గాడు. 'హైరైట్! రాజెవ్ పైకిపోనీ!' అంటూ కేకేశాడు.

రంగుల రాట్నం పైకి క్రిందికి తిరుగుతూవుంది. క్రింద పెట్రొమాక్స్‌లైటు వెలుగుతోంది. దాని తెల్లటికాంతుల్లో నేల మీద ఉయ్యాలల నీడలు దూరంగా పారిపోయి, మళ్ళీ దగ్గరకు వస్తున్నాయి. ఉయ్యాల పైకి లేచిపోతున్నప్పుడు, క్రిందికి వాలిపోతున్నప్పుడు - రామలింగం సంతోషం పట్టలేక కేకలు పెడుతున్నాడు. విరామం లేకుండా వాగుతున్నాడు. సుందరానికి చాలా సిగ్గుగా వుంది.

రామలింగంలో వచ్చిన ఈ మార్పుకు కారణం కనిపెట్టడానికి సుందరానికి ఎంతోసేపు పట్టలేదు. తాము కూర్చున్న ఉయ్యాల పైకి పోగానే-దానికి సూటిగా క్రిందవున్న ఉయ్యాలలో పడేటట్లుగా చాక్లెట్ విసిరాడు రామలింగం. అందులో ఇద్దరు ఆడపిల్లలు కూర్చుని వున్నారు.

రంగులరాట్నం యింకో చుట్టు తిరుగుతూన్నప్పుడు-ఉయ్యాలలు ఒకదానికొకటి ఎదురయ్యాయి. సుందరం కంటిపాపల్లో ఎవరిదో ప్రతిబింబం పడి క్రిందికి జారిపోయింది. అతడు ఉలికిపడ్డాడు.

ఆ ఉయ్యాలలో—ఎర్రటిబట్టలు కట్టుకున్న గౌరి కూర్చుని వుంది.

అతడు మళ్ళీ అటువైపు చూడలేదు, మిత్రుని ముఖంలోకి చూశాడు. రామలింగం కళ్ళు రంగులరాట్నంలా తిరుగుతున్నాయి. ఆ కళ్ళలోనుండి సూదులు కురుస్తున్నాయి. అతని నల్లని మొహంమీద కెంపులు పువ్వులు పూస్తున్నాయి. అతని పెదవులమీద నవ్వులు దొర్లుతున్నాయి!... ఆకాశంలో మినుకు మినుకుమంటున్న ఒక నక్షత్రంవైపు చూపు మరల్చుకున్నాడు సుందరం.

కొంతసేపటికి ఉయ్యాలల్లోంచి అందరూ క్రిందికి దిగారు

గౌరి, ఆమెతోవున్న మరో అమ్మాయి దుకాణం వైపు దారితీశారు. రామలింగం సుందరం భుజంమీద చెయ్యివేసి దగ్గరకు అదుము కుంటూ వాళ్ళకు కాస్త వెనుకగా నడవడం మొదలెట్టాడు.

వాళ్ళిద్దరూ వెనక్కి తిరిగి చూశారు.

రామలింగం నవ్వాడు.

'ఎవరికోసంరా వీపాట్లు ? గౌరి కోసమేనా ?' అన్నాడు సుందరం

'ఛాఛా ! ఆమె నాకు చెల్లెలి వరస !'

'నాకు తెలియదులే !...అయితే మరెవరు ?'

రామలింగం కాస్త సిగ్గుపడుతూ అన్నాడు...'గౌరి పక్కనున్న పిల్ల !'

అలంకరణ సాధనాలు అమ్మే దుకాణం ముందు ఆ అమ్మాయి లిద్దరూ ఆగారు. తన మిత్రుడు వలచిన పిల్లను పరీక్షగా చూశాడు సుందరం. ఆ అమ్మాయి నల్లగా వుంది. నల్లగావున్నా, అందం గానే వుంది. నడుము సన్నగావుంది. ఎర్రంచు తెల్లచీర కట్టుకుంది. తెల్లటిరవిక తొడుక్కుంది. రవిక లోపలి బాడీ కనిపిస్తోంది. ఆమె రెండు జడలు వేసుకుంది. తలలో మల్లెలుముడుచుకుంది. రామలింగం వైపు ప్రేమపూరితచూపులు చూస్తోంది. ఆ కళ్ళు తెల్లగా వున్నాయి. కారణం లేకుండానే మాటిమాటికి నవ్వుతూ వుంది. ఆ పళ్ళు తెల్లగా వున్నాయి.

సుందరం నవ్వాడు, 'ఎవ్వరా ఆ తెల్లపిల్ల?'

'మా వీదిలోనే వుందిలే!'

'పెళ్ళి చేసుకుంటావా?'

అతడు ఎదురుచూడని జవాబు వచ్చింది.

'దానికి పెళ్ళయింది.'

'నువ్వు చెస్తున్న పనులు నాకేం నచ్చలేదు.' అన్నాడు సుందరం, కాస్సేపాగి.

'ఎందుకూ?'

'ఆ అమ్మాయికి మొగుడున్నాడు.'

'వుండనీ! ఆ జ్ఞానం దానికె లేనప్పుడు నా కెందుకుండాలిరా?'

సుందరం మళ్ళీ ఆమెవైపు చూశాడు. ఈసారి అందంగా కనిపించలేదు. 'ఛీ ఛీ! ఇంత నల్లగా వుందేం?.. ఎంత అసహ్యంగా వుంది! చూడటానికే ఏవగింపుగా వుంది' అనుకున్నాడు.

అమ్మాయి లిద్దరూ అక్కణ్ణుంచి కదిలారు. ఆ నల్లటి పిల్ల ఒయ్యారంగా నడుస్తోంది. కొంగు చంకకిందినుండి లాగి, చేత బట్టు కుంది. గౌరితో చాలా హృదువుగా, పెళ్ళికాని ముగ్ధలా కన్నెపిల్ల వేషం వేసిన సినియర్ తారలాగ మాట్లాడుతోంది.

వాళ్ళిద్దరూ ఓ పెద్ద గుంపువద్ద ఆగారు. రామలింగం, సుందరం ఆ గుంపుకు మరోవైపున నిలబడ్డారు.

'పిల్లలంతా కూర్చోవాలి!' అన్నాడు గారడీవాడు.

'బతికించావురా తండ్రీ!' అన్నాడు రామలింగం మెల్లగా. అవ తలివైపున—ఎదురుగా ఆ అమ్మాయి బాగా కనిపిస్తోంది. సుందరం భుజంమీద గడ్డం ఆనించి, ఆమె కళ్ళలోకి చూస్తూ, సైగలుచేస్తూ నుంచున్నాడు రామలింగం. ఆమె కొంగు నోట్లో పెట్టుకుని చిలిపిగా నవ్వుతోంది. పక్కనున్న గౌరి భుజం మీద చెయ్యివేసి, దగ్గరకు జరిగి, ఆమె చెవిలో ఏదో చెప్పింది. గౌరి నవ్వింది. ఆ నల్లమ్మాయిలాగా తెచ్చికోలు నవ్వు కాకుండా సహజ మైన నవ్వు నవ్వింది.

గౌరి సుందరంవైపు ఓసారి చూసింది. ఆ చూపులో అతనికి హేళన కనిపించింది. 'ముక్కిడున్నావటా మిత్రా? నన్ను నాలుక కోస్తానన్నావుగా ఏంతపని చేశావో చూశావా?' అంటున్నట్లుంది.

అతను ఆమెవైపు చూడటానికి, ఆమె కళ్ళముందు నిలబడ టానికి సిగ్గుపడుతున్నాడు.

గారడీవాడు అందర్నీ హెచ్చరిస్తున్నాడు. 'మీ జేబుల్ భద్రం! నేను యిక్కడ గారడీ చేస్తూవుంటె, మీ వెనకాల జేబు దొంగలు గారడీ చేస్తారు బాయనా! ఒక కన్ను యిక్కడపెట్టి, ఒక కన్ను మీ జేబులమీద పెట్టుకోండిసార్! లేకుంటే మీ జేబుల్ మాయం తండ్రీ!'

సుందరం జేబు తడుముకున్నాడు. డబ్బులు మాయం కాలేదు. అతను పక్కకు తిరిగి చూశాడు. తన మిత్రుని జేబుల్లోని డబ్బులు కనిపించలేదు. ఆ జేబులు కనిపించలేదు. ఆ జేబులకు సంబంధించిన బట్టలు కనిపించలేదు. ఆ బట్టల్ని తొడుక్కున్న రామలింగం అనబడే శాల్తీ కనిపించలేదు.

సుందరం ఆ నల్లటి పిల్లకోసం చూశాడు. ఆమె కూడా మాయమైపోయింది. గౌరి ఒక్కతే నిలబడివుంది.

( స శే షం )

చర్చ:

# "బాలవ్యాకరణము - త్రిలింగ లక్షణ శేషము"

శ్రీ పాతకోట రాధాకృష్ణమూర్తి

నేను జూన్ నెల "భారతి" లో "బాలవ్యాకరణము త్రిలింగ లక్షణ శేషము" అను నాగళ్ళవారి వ్యాసమునుగూర్చి యొక లేఖ వ్రాసితి. తదుపరి వారు సెప్టెంబరు నెల "భారతి" లో దానికి సుదీర్ఘమగు సోత్ప్రాస పూరిత సమాధానము వ్రాసిరి. దానిపై నా యభిప్రాయము ముటంకించు చున్నాను.

నాగళ్ళవారు పక్షపాత రహితులు-స్వపర భేద శూన్యులు-సమచిత్తాభావులు. కావున్. వారిమాటలతోఁ జెప్పవలెనన్న "శ్రీ పాతకోట రాధాకృష్ణమూర్తి యనువా" రను వాక్యమే వారి పై మాటలకుదాహరణ. ఏవమేతత్.

నాగళ్ళవారి వ్యాసము ముఖ్యోద్దేశమిదియట— "సీతారామాచార్యులవారు త్రిలింగ లక్షణ శేషమునందు నెలకొల్పిన కొన్ని లక్షణములు చిన్నయసూరికిఁ దెలియునని నిరూపించుట.', వారి వ్యాసమునకుఁ జారిత్రకాంశములున్నవట. వీరు వైయాకరణులగుటయేకాదు చారిత్రకజ్ఞులని యిందు మూలమునఁ దెలిసినది. చారిత్రక సత్యములనే వీరు మూదలగాఁ గైకొనిరట! అన్యములు గ్రహింపరైరి? తావదేవాస్తు. "నేనీ పని సేయుట దురభిమానముగాఁదోచినది పసువిత్తులగు మూర్తిగారికి! అది నా దురభిమానము గాదనియు సూరి ప్రతిభా నిదర్శనమనియు ముద్దగట్టిన మూర్తిగారు గుర్తింపకపోవుట దురదృష్టము". ఆహా! ఏమి రచనాచణత్వము! ప్రతిభా రాశి భూతులన్నమాట నాగళ్ళవారు. వారికిది సహజ సిద్ధమని భావింపవచ్చునేమో? సూరిగారి ప్రతిభమాపుటకే వీరీ వ్యాసము వ్రాసినారా? సూరి ప్రతిభావంతుడనియు నాచార్యులవారు గారవిమ్ము దీని యర్థము గాదా? వీరికి "ప్రతిభ" యను పదమునకుఁదెలిసిన యర్థ మెట్టువంటిదో పండితలోకము విలోకింపుత! వీరి నిష్పక్షపాత బుద్ధి శ్లాఘనీయము గాదామరి?" ఆచార్యులవారిపట్ల నాకెట్టి యసూయయు లేదు. "ఆహా! సూరిగారి ప్రతిభనె వీరు గుర్తింపినారుగాని యాచార్యులవారి ప్రతిభ నేల గుర్తింపరైరి?

నాగళ్ళవారు "ఆచార్యులవారి యగుణములను మాత్రమే నేను జూచితినని వారి యభిప్రాయము. అనగా నాచార్యులవారిలో దోషములున్నవని వారంగీకరించుచున్నారన్నమాట. ఇది వారి యౌదార్యమును గుర్తు." బాగున్నది యీ వచన రచన. వీరి దృష్టిలో సూరి దోషరహితుడని. ప్రమాదో ధీమతా మపి. సూరి రచనలో నెన్నియో దోషములున్నవనియు చాల ప్రయోగములను సూరి సాధింప లేదనియు వ్యాకరణవేత్త లెఱింగినదే. వైయాకరణ ఖసూచుల మాట నిటుఁ దడవనేల?' నాకు దివ్య చక్షువు లేదు. మానవ మాత్రుడను. చర్మ చక్షువు మాత్రమే నాకున్నది"—ఇది వారి పాండిత్య శౌండిమమునకు నిదర్శనమా? "దివ్య చక్షువు"— అను పదమునకు వారు గ్రహించిన యర్థమది లతను కత్తెరయగునో నీతను కత్తియగునా? విజ్ఞులు గ్రహింతురు గాక ఏమిసేయుదు!

నావి చిలుక పలుకులని వారు చిలుక పలుకులు పలికినారు. వీరీ జాతీయమున కర్థమంతగా తమే గ్రహించినారు. పూర్వము పశు పక్ష్యాదులు గూడ ధారాళముగా మాట్లాడెడివని యనేక గ్రంథముల వలనఁ దెలియుచున్నది. ఇంతెందుకు-పింగళి సూరన కళాపూర్ణో దయములో శుచిముఖియను శుకమునుగూర్చి చదివియే యుందురు నాగళ్ళవారు! అవియు చిలుకపలుకులేగదా!

"నేనాశించిన పదవి వారికిఁ బ్రాప్తించిన యెడల నాకు వారి పట్ల వైరము గలదని యనుట కవకాశముండెడిదిదేమో?" అట్టి సన్నివేశము నైతము సంభవింపదయ్యె" ఏమా పదవి? ఏమా సన్ని వేశము? ఇదేదో ప్రహేళికవలె నున్నది? లేక పురాణగాథ యేమైన నున్నదేమో నాగళ్ళవారే తెలుపఁ సమర్థులుగదా!

"రాధాకృష్ణమూర్తిగారికి నా వ్యాసమేగాదు బాలవ్యాకరణ రహస్యమును బట్టుబడలేదు." ఓ యాంధ్రదేశమా! యింతటి వైయాకరణిని-బాలవ్యాకరణ రహస్య తత్త్వచింతామణిని గుర్తింపని నా యీ బుద్ధిని మన్నింపుము! నాగళ్ళవారు వ్యాకరణ పాథోనిధిని మథించినవారు. వారి వ్రాతలే వారి వ్యాకరణ రహస్యజ్ఞతను జాటు చున్నవి. వారు మూర్తిగొన్న వ్యాకరణ స్వరూపులు. అందునా బాల వ్యాకరణ సూక్ష్మాతిసూక్ష్మ రహస్యజ్ఞాతలు" ఆహా! ఏమీ యీ స్వవచన పాటవము.

"మీరాచార్యులవారిని ద్వేషించు చున్నారు. సూరిపట్ల మీకుఁగల దురభిమానమెందు. ఆచార్యులవారు చెప్పినవి యెటిఁ గిన సూరి వానిని బాలవ్యాకరణమునఁ జేర్పలేదేమి? సూరి సూత్ర ముల కపవాదములు లేవా? అను వితండవాదమునకు దిగిరి" ఈ మాటలన్నియు నేనన్నట్లు నాగళ్ళవారు వ్రాసిరి. గుమ్మడి కాయల దొంగ యెవరన్న బుజములు తడుము కొన్నట్లున్నది. నా వ్రాతలు వారికంత చక్కగా నర్థమైనవన్నమాట. ఇది వితండ వాదమట! ఈ మాటకర్థము వారు తెలిసి ప్రయోగించారో? తెలియక ప్రయోగించారో? నా లేఖ చూచిన వారికి నా వాక్యములా లేక నాగళ్ళవారి యసూయా జనిత వాక్యములా యని తోపకపోదు. దీనికి విజ్ఞులే సాక్షులు.

"తద్భవములందు నలఘు రేఫము కలదు." ఇది యాచార్యుల వారి సూత్రము. 'శకటరేఫము తద్భవములందు లేదు' ఇది సూరి సూత్రము. నాగళ్ళవారు చాలకాలము శ్రమపడి ప్రయోగములు చూపి నారు. తథాస్తు. ఈ శబ్దము తద్భవమని-యందలిది శకటరేఫ మని నిష్కర్షగా నిరూపించు లక్షణము లేదని విజ్ఞులెరింగినదే కాని—

గీ. "తెలుకొన జూచి నగియు నీ పెఱుఁడధము డగుట-" అని "పెఱుఁడు"లోని శకటరేఫ భ్రాంతిచే నిది తద్భవమని వ్రాసినారు. ఇది దేశ్యమని శ. ర. లో స్పష్టముగా నున్నది. ఇదియే వీరి ప్రయోగ ప్రదర్శన నైపుణి.

అల్పాక్షర మసందిగ్ధం సారవ ద్విశ్వతో ముఖమ్
అస్తోభ మనవద్యంచ సూత్రం సూత్రవిదో విదుః

ఇది సూత్రలక్షణము. ఈ లక్షణము నిష్కర్షగా సూరి పాటించె నన్నచోఁ బై సందేహమును దీర్పని సూత్రము నాతఁడేల గవించె? ఆతఁ డొక్కొక్క పర్యాయ మొక శబ్దసాధుత్వమున కొక సూత్రము నిర్మించినాఁడు. కొన్నింటిని నిపతించినాడు.

ప్రయోజన ప్రయుక్తం. (ప్రకీర్ణ. 5) బాల.
స్త్రీకి నిర్మితిని గుణంబు రేదు. (క్రియా 69 బాల)
నువర్ణంబు లోపించు (ఆచ్ఛిక. బాల. 20)
తుది యక్షరంబు లోపించు (ఆచ్ఛిక బాల-21)
వేధ పురోధ స్సుబోధసుదు (తత్సమ. బాల ?2)
నౌ శబ్దంబునకు నావ యగు (తత్స-బాల. 63)

పృథ్వ్యాది శబ్దంబునకు ధువియగు (తత్స. బాల. 62) ఇట్లు సూత్రించిన సూరిగారికి పై శబ్దము అసాధుత్వమును గూర్చి సూత్రించిన వచ్చెడి నష్టము లేదుగదా? నాగళ్ళవారు వారి ప్రయోగములఁ జూపినారుగాని నేను చూపిన సూరిని పాత విష యము పేర్కొనరైరి. ఇదియే వారి గ్రంథ పాటవము.

పేట విషయమున నా వాక్యమును నాగళ్ళవారర్థము చేసి కొన్నట్లులేదు. నాగళ్ళవారి కర్థము తెలియుట సాధ్యమా? కాన

వారు విపరీతముగా వ్యాఖ్యానించినారు.

జవ్వనంబున ం ను నకార విషయము. ఈ విషయమున వా రెందులకో శాంత గంభీరు లైనారని తోచుచున్నది. 'బాలవ్యాకరణ మున లేకపోవుటకుఁ దద్దపనా ప్రణాళికయే హేతువు. సూరికిఁ దెలియునని నిరూపించుట నా లక్ష్యము.'' వీరి లక్ష్యము కొనియాడ దగినదే కాదనను. కాని సూరికిఁ దెలియని యెన్నో విషయముల నాచార్యులవారు-చూపించినారే వాని నేల వీరుగ్రైకొనరు? దీనివలన నాచార్యులవారిపై నాగళ్ళవారికిగలది దురభిమానము గాదా?

ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గసడదవలగు
(బాలవ్యా-సంధి. 15)

కొన్ని యెడం ద్వంద్వంబునం బదంబుమీది చ త వ లకు న ద వ లు గానంబడవు. (త్రిలింగ-సంధి. 6)

నాగళ్ళవారు చెప్పినట్లు పై సూరి సూత్రము నిత్యవిధియైన అందచందములు-కండతుండెములు-రాకపోకలు మున్నగు ప్రయోగము లెట్లు సిద్ధించును.

అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి. (బాలవ్యా)

నిన్నడదులన్ నెఱిదగుఁ (త్రిలింగ)

ఇట నెఱ+నడుము = నెన్నడుము. పూర్ణమైన నడుము. కాని నెఱ+నడ = పూర్ణమైన నడక యందుమా? అందువలన నెఱి + నడ = అందమైన నడకయనవలెనని యాచార్యులవారు సూచించిరి. ఇంచ్లే పూఁబోడి సూరి సాధితము కాని ననబోడి విరిబోడియనునవి పూవుంబోడివలె ననంబోడి, విరింబోడి యని సూరి మతమున కావలసివచ్చును. ఇట్టి పెక్కు విషయముల నాచార్యులవారు తెల్పిరి. అందులకే యిది త్రిలింగ లక్షణశేషము. నాగళ్ళవారిన్ని విశేషములు చూపిన యాచార్యులవారిని కొంచెమైనను నోరార మెచ్చుకొనలేకపోయిరి. వారి యభిమానమాపాటిదికాదామరి?

"లజ్జావారిధి దిగి'' అని నేను చూపిన పాఠము వావిళ్ళవారిని వలచి వ్రాసిన వ్రాతలట. అని యు పమాణపట. వీరు చూపిన "తగ'' ప్రయోగములు వావిళ్ళవారి పుస్తకములలోనివిగాదా? "తగ'' యనుటయే సమంజసమని వారెంతయో శ్రమదీసికొని ప్రయోగములు సందర్భశూన్యములైనను కాలహరణమునకై పెక్కు చూపిరి.

ద్రౌపది కృష్ణునితో నన్నమాటలివి-

"ఈవు మనంబునన్ మరచితే నభోఁ దనచిర మెట్టుకో
గా విడిపింపనుండరును గర్గియు నిర్దయులై కనుంగొనన్
హో వసుదేవపు త్ర యర నక్షము వస్త్రము లిచ్చినప్పు ల
జ్జావనరాశిలో మునిగి చావకయుండక నుద్ధరించుటల్.''

ఇందును "లజ్జావనరాశిలో మునిగి'' యనియే శాబ్దిక శిల్పవేత్త యగు పినవీరభద్రుడు ప్రయోగించినాడు వారికిది పాఠ్యగంధమెగదా యందు వలన గుర్తింపరైరి. ఇది దురర్థమో సదర్థమో విజ్ఞులు గమనింతురుగదా!

"అనేక కర్తృక క్రియకు సమీపకర్తయొక్క లింగవచనంబు లగు''—ఆచార్యులవారి సూత్రమిది "వారాచార్యులవారిని సమర్థించుటకు దిగి పడిన ఓంటాలిన్ని యున్నిగావు అవి యున్నియు వారి వ్యాకరణ శాస్త్ర పతనము పునాదిలేనిదని బుజువుచేయుచున్నవి.' ఇవి నాగళ్ళవారి మాటలు. వీరా శాస్త్రమున బాగుగా బుద్ధి కలిగినవారని పరోక్షముగా వారే చాటుకొనుచున్నారు. ఇందెచ్చట బుజావు అని పడుటకు మారుగా బుజువు అని పడినది. ఇది ముద్రారాక్షసమా? లేక వారి చేతివ్రాతయా? వీరి వ్యాకరణ శాస్త్రపతనము నిరుపాసనము - నిష్ఫలమని తెలియుటకై వీరు పాటుపడుచున్నారనిపించును.'' ఆచార్యులుగారు చెప్పినది నిత్య విధిగాదు. అగునని సూత్రమున నున్నంత మాత్రమున నది నిత్యము యని భావింపరాదు. ఇవి వారు చేసిన వ్యాకరణశాస్త్ర రహస్యోపదేశ ములు'' ఇవి నాగళ్ళవారి మాటలు. నేనన్నవి వ్యాకరణ శాస్త్ర రహస్యోపదేశములట. వారికి నేనెప్పు డుపదేశించితినో నాకు తెలియదు. అవి రహస్యోపదేశములు గదా! ఇంతకు వారి గ్రహణ పాటవ మెంటిది. అగునన్నచో నిత్యమనియా యర్థము? దీనివలన నాగళ్ళవారి వ్యాకరణ శాస్త్రజ్ఞానము వెల్లడియగుచున్నది. "ద్వంద్వము నందు బహుళముగానగు' నని సూరి సూత్రము. ఇంక బహుళమన్న నేమి? మరి "అగు''నని ప్రయోగింపనేల? ఆ దళ [illegible]? ఆచార్యులవారు నిత్యవిధిగా భావించి ఆ సూత్రము వ్రాసిరని నాగళ్ళవారు భావించుట వారి శాస్త్ర పరిజ్ఞానమునకు నిదర్శనము. ఆచార్యులవారిది త్రిలింగ లక్షణశేషమని నాగళ్ళవారే యంగీకరించు చున్నారు. సూరికి యనపత్యగ మగుటచే నిది [illegible]. వ్యాకరణ మెప్పుడు ననుగ్రహమే. ప్రవాహమునకే శబ్దజాలము పెరుగు చుండును. అట్టి వానిని నన్నింటిని సాధించుట ప్రథమ వ్యాకర్త

దుస్సాధము. అందుకొననే వ్యాకరణములు వెలయుచుండెను. ఆచార్యులవారి వ్యాకరణము సమగ్రమని చెప్పజాలము. "మూర్తిగారాచార్యు వారిని తమ పాండిత్యమునకు బలిచేయుచున్నారు." నాగళ్ళవారి ఈ మాట సందర్భ రహితముగా నున్నది. "అను"నన్న దానిని నిత్యమని భావించి రాద్ధాంతము సేయుట వారి వ్యాకరణజ్ఞతకు ప్రత్యక్ష నిదానము.

"సంస్కృతమున పాణిని సూత్రములకు వార్త్తికములు వెలసినవి. వానికి పతంజలి మహాభాష్య మవతరించినదని తమ సంస్కృత వ్యాకరణ శాస్త్ర పాండిత్యము ప్రదర్శించి మూర్తిగారు పాణినీయులు వ్యాకరణ సూత్రములను సంజ్ఞా–పరిభాషా–విధి–నియమాతిదేశాధికారములని యాఱు తెగలుగా విభజించిరన్నమాట మరచిరి. ఆచార్యులవారి సూత్రవిధా షడ్విధ సూత్రములలో నదియుగదా?' నాగళ్ళవారు నా మాటలకు విపరీత వ్యాఖ్యానము చేసినారు. నా యుద్దేశ్యము "అను"నని యున్నంత మాత్రమున విధిసూత్రము కానక్కరలేదనియే. అది నియమము. వారిది గుర్తింప నుండుట నా దోసమా? "కర్మధారయంబులం దుత్తునకచ్చు పరంబగునపుడు ఉగాగమంబగు" ఇది నాగళ్ళవారి మతమున వారు చెప్పినట్లు సంజ్ఞా పరిభాష-విధి-నియమాతిదేశాధికారములలో నే తెగకు చెందునో? విధియన్నచో ప్రక్కటెముక యిత్యాదులు సాధువులు గానేరవుకదా? 'కర్మధారయంబునందు పేర్వాచకముల శబ్దముల కచ్చు పరంబగునపుడు ఉగాగమంబు విభాషనగు" ననునది విభాషకే యన్వయించునా? ఆ సూత్రముచే ముద్దుత స్త్రీ పదములు కొన్నింటివిషాదనే యచ్చులకు ఉగమము విభాషగానగు. కాని ఘంపులవిగాద నిత్యమనిపించును. సరసపుటలుక–సము దపు టొద్దు మున్నగునవి. మరి యిప్పుడు సూరి సూత్రమున విభాష యున్నది సార్థకమా? దీని నేమనవలె? అగును నిత్యమనను రెండింటికి భేదము నాగళ్ళవారికి తెలియునా? అగునని సూత్రించిన సూత్రము నందలి విధికి భిన్నముగా వేరొక విధియు ననంతవరము ని నియమము ప్రవర్తించునని యర్థము. భిన్నముగా విధించినప్పుడీ సూత్రము పనిసేయదు. అత్తునకు సంధిబహుళముగా నగునను సూత్రము గైకొందము. ఉదాహరణము లందలి పదములకు మొదటి యచ్చు లన్నింటి నిచ్చినాడు.

రాముడు + అతడు = రాముడతడు

సోముడు + ఇతడు = సోముడితడు

మనము + ఉంటిమి = మనముంటిమి

అతడు + ఎక్కడ = అతడెక్కడ

అతడు + ఒకడు = అతడొకడు

ఇందు ఋ ౠ అను నచ్చు నీయలేదు. దానికి కారణము ప్రక్రియాకౌముదిమ మొదటి సూత్రమున ఋ ౠ వర్ణములు రల తుల్యముగా నిర్ణయించుట. అరము + ఋషి అరము ఋషి యనియే యుండును. ఋవర్ణము రవర్ణ తుల్యమగుట సంధి కవకాశములేదు. ఇట్టివాని కవకాశము కల్పించుటకే సూరి ఈ సూత్రమున నిత్య మనక యగునని సూత్రించెను. అందువలనే తర్వాతి సూత్రమున కవకాశము కలిగినది. ఇది తెలియదు గనుకనే నాగళ్ళవారికి నేనింత విపులముగా వ్రాయవలసి వచ్చినది. ఇప్పుడిది విధి సూత్రమగునా? నాగళ్ళవారన్నట్లు సంజ్ఞాపరిభాషాదులలో నిది దేనికి చెందును? వారి మతప్రకారము చెప్పినచో బాలవ్యాకరణము తిరిగి వ్రాయవలసి యుండును. అప్పుడు చిన్నయసూరి వ్యాకరణ సంప్రదాయమెఱుగని యపవాదము పాలగును. నాగళ్ళవారు సూరిని తమ వ్యాకరణ పాండిత్యమునకు బలిచేయుచున్నారు. వ్యాకరణవేత్తలిది పరిశీలింతురుగాక.

"సూరి వర్ణంబులను నెఱుగనివాడు గాడు"–ఇత్యాది నాగళ్ళవారి వాక్యము లెందులకుదాహరణములో తెలియదు. సూరికి శబ్దములు తెలియవను కొందమా? 'వ్యాకరణ వేత్తలు కొన్నింటికిమాత్రమే సూత్రములు నిబద్ధింపగలరు." అని నేను వ్రాసిన వ్రాతలు సక్రమముగా నర్థము చేసికొనలేదు. అట్లయిన నింత సిద్ధాంత రాద్ధాంతము జరిగెడిదికాదు.

నాగళ్ళవారు నన్ను తమ సంస్కృత వ్యాకరణ పాండిత్యము ప్రదర్శించినా" రని సోల్లుంఠనముగానన్నారు.

నా మాటల సపార్థము చేసికొని నాగళ్ళవారీ విధముగా పలికినారు. విద్వల్లోక మిందలి నిజానిజము గుర్తింపకుండునా? "అవి పన్నెగాడు సూరినిగూడ ... కెను" ఏమి యీ వాక్యము? సూరికి నాగళ్ళవారికి పోలికయా? ఇది స్వభావోక్తియా? అతిశయోక్తియా? లేక యుత్ప్రేక్షయా?

# చెప్పండి చూద్దాం

భారతదేశం వెనుకబడిన దేశం అని మనం అంటున్నాము కదా. మరి మన దేశంలో తయారైన చిత్రాలు ఇతర దేశాల్లో మన్నన పొందుతున్నాయా ఎక్కడెక్కడ మన చిత్రాలకు అంతర్జాతీయ స్థాయి ఉత్సవాలలో మన్ననలు వచ్చాయో చెప్పండి చూద్దాం.

మీరే చెప్పండి మాకు జ్ఞాపకం లేదు.

ఎప్పటి దప్పుడే మర్చిపోతుంటే ఏలా స్వామి !

కెనస్, శాన్‌ఫ్రాన్సిస్కో, మనిలా, వ్యాంకోవర్, స్రాట్‌ఫోర్డ్, ఒంటారియో, వెనిస్ ఇంకా ఇంకా...... ......
... ... ... ... ... ఎన్నో చోట్ల.

ఆ మర్యాద ఆ గౌరవం మనం ఇక ముందు కూడా నిలబెట్టుకోవాలి. ఆ ప్రశంసలు అన్నీ వెనుకబడిన దేశం కదా అని దయతలచి ఎవరో ఇచ్చినవి కావు. మన ప్రతిభ చేతా సామర్థ్యం చేతా మనం గెల్చుకొన్నవే.

మన రాష్ట్రంలో చలనచిత్ర అభివృద్ధి సంస్థ ఏర్పడబోతున్నది. దక్షిణ భారత చలనచిత్ర పరిశ్రమలో ఇది ఒక చారిత్రాత్మకమైన, అపూర్వ సంఘటన.

## ఈ సంస్థ ఏమి చేస్తుంది?

** చలన చిత్రాల ఉత్పత్తికై స్టూడియోలు, లేబొరేటరీలు, థియేటర్లు, రంగస్థలాలకు ఋణాలు ఇస్తుంది.

** అత్యంత ఆధునిక పద్ధతులలో చలనచిత్ర పరిశ్రమను అభివృద్ధి పరచేందుకు సాంకేతిక, సంఘిక సౌకర్యాలు కలిగిస్తుంది.

## వ్యాపార రంగంలో

** సినిమాటోగ్రాఫ్ తత్సంబంధమైన వివిధ రకాల సామాగ్రి వ్యాపారం కొనసాగిస్తుంది. చలన చిత్ర పరిశ్రమకు సంబంధించిన ముడిఫిల్ము, రసాయనపదార్థాలు, మేగ్నటిక్ టేపులు, ఫోటోగ్రాఫ్‌లు మున్నగువాటి దిగుమతులకు ఏర్పాటు చేస్తుంది.

** చలన చిత్రాల ఉత్పత్తిలో కళాత్మకమైన సాంకేతికమైన ప్రమాణాలను పెంపొందించటానికి వార్షిక చలనచిత్ర బహుమతులు కార్యక్రమాలు, చలన చిత్రోత్సవాలు పోటీలు మున్నగు వాటిని నిర్వహిస్తుంది.

** థియేటర్ల స్థాపనకు తోడ్పడి, ఇందు కొరకు అవసరమైన చోట్ల పెట్టుబడి ఋణ సౌకర్యాలు కల్పిస్తుంది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వసమాచార, పౌరసంబంధశాఖ నం.25/75—76

# తెలుగు లిపి సంస్కరణ
# కొన్ని సమస్యలు - సమాధానాలు

డా. బయ్యా వెంకట సూర్యనారాయణ

ఒక్క బ్రహ్మలిపి తప్ప తెలుగులిపియేకాదు ఏలిపి అయినా మార్చడానికి వీలుపడనిదికాదు. బ్రహ్మలిపి కాకపోయినా బ్రహ్మ లిపి వేసిన వేషాలేకదా! ఈనాడు మనం భారతదేశంలో చూస్తున్న లిపి భేదాలు! లేదా ఎక్కడ ఉంది! అంటే ఆ మార్పులన్నీ ఎవరూ పనిపట్టి చేసినవికాక, వ్యవహారంలో కాల క్రమంగా వచ్చినవి కావడం చేత వ్యవహరించే జనులకు వింతగా కనిపించకుండానే స్థిరపడిపోయేయి. కమిటీలు వేసి ఈనాడు మనం చేస్తున్న, లేదా చేద్దామని ఆరాట పడుతున్న మార్పులన్నీ పై విధంగా కాకపోవడంచేతనే అనేక వివాదాలు చెలరేగుతున్నాయి. అయినా పంచభూతాలనూ లొంగదీసుకున్న అరవభూతమైన మానవుడు ఈ చిల్లర అల్లరులకు లొంగిపోయి అవసరమైన అభిప్రాయాలనుకూడా ఆచరణలో పెట్టలేనంత అసమర్థుడు అయిపోయేడంటే నేను నమ్మను. మిమ్మల్నీ నమ్మనివ్వను.

మారుతూన్న ప్రపంచంలో—ఏమాత్రం మారనే మారను—అన్న మానవునికి మరణమే శరణం. అలాగే మార్పు గోరంతకాగా, మారాలి అన్న ఆరాటం కొండంత అయినా మానవునికి అరణ్యమే శరణ్యము. గిరి శిలువైన మానవునికి యాన సాధనాలు అవసరమే కాని, అలాటి ప్రతియాన సాధనానికీ బ్రేకులుకూడా అవసరమే—అన్న సంగతి మరిచిపోతే చాలా ప్రమాదం.

ఇంతకూ నేనుప్పుడు చెప్పదలచుకున్నదాని సారాంశం ఏమిటంటే - మార్పు ఏదయినా కేవలం మార్పుకోసమే కాకూడదు. అది అవసరమైనదీ, ఆచరణయోగ్యమైనదీ, సమర్థించదగినదీ కావాలి. అలాగే ఆరాటం కొద్దీ అప్పటి స్థితికి ఏమీ అతకనంత అసహజమైన పరివర్తనాలుకూడా అంత ఆరోగ్యకరం కాజాలవు. ఒక పేదరాలికి దాని చినికిపోయిన మురికి గుడ్డలు పారవేసి కట్టుకోమని కాస్త గట్టిగాఉన్న శుభ్రమైన గుడ్డ ఇస్తే ఇబ్బంది లేదుగని, ఒక మహారాణివలె అలంకరించి పంపితే పాపం ఆమె పసిపాపలు ఆశ్చర్యమో అనుమానమో చూసి, అలా అలా పారాడేగాని ఆప్యాయత, అనురాగంచూపి ఆమె ఒడిలో వాలరు. ఒక జాతికి తన భాష, లిపిలకు మొదలైనవానిలో ఉండే సంబంధంకూడా అలాటిదే. ఈ సంగతి దృష్టిలో ఉంచుకునే ఏమార్పులైనా సూచించవలసి ఉంటుంది.

ప్రస్తుతవ్యాసంలో తెలుగు లిపి సంస్కరణకు సంబంధించిన రెండు అంశాలను గూర్చి నా అభిప్రాయాలను తెలియజేయడానికి ప్రయత్నిస్తాను. ఇవి ప్రశస్తములు కాకపోతే ప్రశస్తములైన మార్గాలు వెతకడంలో కొంత సహాయకములైనా మంచిదే.

1. తెలుగు కన్నడ లిపులను ఏకం చేయడానికి వీలుగా తెలుగు లిపిని సంస్కరించడం.

2. ముద్రణకు అనువుగా తెలుగులిపిలో మార్పులు చేయడం.

తెలుగు కన్నడ లిపులమధ్య, భాషలమధ్య, జాతులమధ్య చాలా చాలా సన్నిహిత సంబంధం ఉన్నమాట వాస్తవమే. ఈనాడు వేరు వేరు ద్రావిడ భాషలుగా రూపొందిన ఎన్నోభాషలకు ఒకప్పుడు ఒకటిగా ఒకేరూపం ఉండేది. అలాగే ఈనాటి భిన్న లిపులకుకూడా ఒకప్పుడు ఒకేరూపం ఉండేది. అలాఅని విడిపోయినవాటిని ఇప్పుడు ఒకటిగా చేయడం సాధ్యమా ? ఒక గిన్నెలో ఒకటిగాఉన్న పెరుగును చిలికివెన్న తీసి, కాచి నేయి తయారుచేసినపుడు అది మజ్జిగ, నెయ్యి అనే రెండు మూర్తులై రెండు పాత్రలలో భద్రపరచవలసి వస్తుంది. అప్పుడు — అరరె! వీటిని రెండు పాత్రలలో జాగ్రత్తపెట్టడం చాలా న్యూసెన్సుగా ఉంది, వెనుకటివలె ఒకే పాత్రలో ఉంటే సదుపాయంగా ఉంటుంది—అని ఆరెంటినీ కలిపి ఒకేపాత్రలోపొయ్యగలమా!

మన్నా పెరుగుగా మార్చివేయగలమా? అందుచేత ఈ రెండు లిపులనూ ఒక్కటి చెయ్యాలి అన్న ఉద్దేశం ఎంత ప్రశస్తమైనదైనా అది అంతగా ఆచరణ సాధ్యం కానిది— అని తెలుసుకోడం మంచిది. ఇప్పటి రెండు లిపులలో ఒకదానిని పూర్తిగా విడచి, ఇరుపక్షాలవారూ ఒకే లిపిని ఆమోదించడం ఒక మార్గం. కాని ఉభయపక్షాలకూ కష్టసుఖాలు సమపాళ్ళలో లేని ఏ ఒప్పందమైనా ఎలా సాధ్యపడుతుంది? రెండు లిపులలోనూ మార్పులుచేసి, ఏకరూపత సాధించే ప్రయత్నం ఇంకొకటి. ఈ మార్పు ఒకటి, రెండుకంటె ఎక్కువ అడుగులు వేస్తే ఇరుపక్షాలలో ఏ ఒక్కరికీ తమ లిపి తమదిగా తోచని ఒక వింత పరిస్థితి ఏర్పడుతుంది. ఇంత కష్టపడి రెండూ ఒక్కటి చేసివేసినా భాషాభేదం ఉండనే ఉంటుంది కదా! ఏమయినాసరే! రెండు లిపులూ ఒక్కటి కావాలి — అంటే భారతదేశం అంతటా బ్రాహ్మీ లిపినే అన్నిభాషలకూ ఎందుకు ఉపయోగించకూడదు?— అని నేనూ అడుగుతాను. అందుచేత ఈ రెండింటిని ఒక్కటి చేసివేయాలి- అనే అసహజమైన పూనిక విడనాడి వాటిని అత్యంత సన్నిహితములుగా చేయాలని, పరస్పరావగాహన సాధ్యములుగా చేయాలని ప్రయత్నించడం మంచిది. ఈ సందర్భంలో నాకు తోచిన మార్గాలు ఒండు రెండు :—

I. రెండు లిపులవారినీ తమతమ లిపులను కొత్త లిపులుగా మార్చివేయనట్టిసీ, రెంటిని సన్నిహితం చేసేవీ అయిన చిన్నచిన్న మార్పులకు అంగీకరింపజేయడం. ఎలాగంటే—

a. కన్నడ లిపిలోని తలకట్లను తెలుగొండివలె వంచకుండా వ్రాయమనడం. (అప్పుడవి తెలుగు లిపిలో సమానం అవుతాయి. ఆ అక్షరాలు ఇంకా చుట్టుకుపోకుండా అరికట్టడానికి ఇది సహకరిస్తుంది కూడా.)

b. ఘ, ఙ, ప, ఫ, ష, స — లను అక్షరాలలో తలకట్టు క్రింది చుక్క తొలగించడంలో ప్రమాదం లేదనీ, అలా తొలగించడం వల్ల అవి ఏ ఇతర అక్షరాలతోనూ అభిన్నములు అయిపోడంలేదనీ కన్నడ లిపి వ్రాసేవారితో చెప్పడం.

c. ఏ, క, ఖ, జ, ఞ, త, శ — వంటి అక్షరాలను తెలుగువారు కన్నడ లిపిలోని అక్షరాలకు సన్నిహితంగా ఉండేలాగ వ్రాయడం.

(ఇలాగే వ్యంజనములకు స్వర చిహ్నాలను చేర్చే పద్ధతిలోకూడా ఆచరణ సాధ్యమై, సహజత్వమునకు సన్నిహితమై ఉండే మార్పులూ చేర్పులూ చేసికోవలసి ఉంటుంది.)

II స్వల్పమైన మార్పులు చేసినా సన్నిహితములు కాని అక్షరాలను తమ లిపిలోని వానితోబాటు రెండవ లిపిలోని వాటిని కూడా తప్పనిసరిగా నేర్చవలసిందిగా రెండు లిపుల వారితో చెప్పడం (మన భాషలో సహజంగా లేకపోయినా ఉర్దూమాటలకోసం ఒత్తక్షరాలు మీద చుక్కలు ఉండే అక్షరాలను ప్రత్యేకంగా ఏర్పరచుకుని తప్పనిసరిగా చిన్నప్పటినుంచి నేర్పుతున్నామా! లేదా! అలాగే ఇదీను)

ఉ, ఊ, బ, బూ, ఛ, ఫ, హ— అలాటివి. (ఇందులో ఋ, ౠల వాడకం తగ్గిన కారణాన్ని, వాటి స్థానే ృ, ౄలు వాడకం ప్రచారంలోనికి వస్తూనందువల్ల ఈ రెండక్షరాలను గురించి అంత పరిశ్రమ చేయవలసిన అవసరం ఉండదు.)

ఇంతటిలో తెలుగు కన్నడ లిపుల ఏకీకరణం గురించిన ఉద్యోగాలను చెప్పే ప్రసంగం ముగిస్తున్నాను. ఇవి కొన్ని సలహాలు మాత్రమే కాని సంపూర్ణములు కావని గమనింపవలసిందిగా నా మనవి.

ఇక రెండవ సమస్య. తెలుగులిపిని ముద్రణకు అనుకూలంగా మలుచుకోడం ఎలాగ? అన్నది.

ఎన్ని ఇబ్బందులు ఉన్నా, ఎండా, వానా సరాసరి ఇంట్లోకే దిగుమతి అవుతున్నా—మా తాతకట్టిన ఇల్లు ఇది—అని అందులోనే కాలక్షేపం చెయ్యడమా! లేక తాతగారు కట్టిన ఇంటిమీద మమత లేక కాదుగాని బుద్ధిపూర్వకంగా ఎరిగి బాధపెట్టుకోడం ఎందుకు?— అని తామూ, తన కొడుకులూ కట్టుకున్న ఇంట్లోకి మారడమా! అప్పటి ప్రస్తుత కారణాలనుండి అనాదిగా వ్యవహరిస్తూ వస్తున్న ప్రస్తుతపు తెలుగులిపి బాగుండేదనిగాని, దీనివల్ల ప్రజలు ఏడుస్తూ పోరున్నారనిగాని, దాన్ని ఇప్పుడు ఏదోవిధంగా మార్చివేస్తేగాని పాత దయిపోయిందనిగాని కాక- ఒక అత్యంత ప్రధానమైన సమస్యను పరిష్కరించడానికి ఈ ప్రస్తుత లేవనెత్తే సమాధానంకోసం,సరిపుతం కావలసి వస్తూంది. భాషయొక్క మౌఖికమైన వ్యవహారంకంటె లిఖితమైన వ్యవహారానికి, లిఖితమైన వ్యవహారంకంటె ముద్రితమైన వ్యవహారానికి ఈనాటి జీవితంలో ఎంత ప్రాధాన్యం ఉందో అందరికీ తెలిసిందే కదా! నేటి మన జీవితాలు చాలావరకు ముద్రణలో ముడిపడి ఉండడం కారణంగా ఆ దృష్టితో నేటి

తెలుగు లిపినే కొనసాగించడంలో ఉండే సాధక బాధకాలు ఆలోచించడం తప్పనిసరి అయింది.

మన ప్రస్తుతపు తెలుగు లిపి ముద్రణ విషయంలో మూడు చెరువుల నీళ్లు త్రాగిస్తుంది - అనేవారు ఇంకొకవంక ఆంగ్ల భాషలో ముద్రణ ఎంత సులభమో కదా! అనీ, అందులో అక్షరాల సంఖ్య చాలా తక్కువ-అనీ దాన్ని పొగడడం కూడా వింటూ ఉంటాము. కాని ఆంగ్లంలో వ్యవహరించేలిపి ధ్వన్యాత్మకము కాదు-అన్న సంగతి మరిచిపోకూడదు. భిన్నధ్వనులకు ఒకే వర్ణమును వ్యవహరించుకొని కాలక్షేపం చేయడంలో గొప్ప ఏముంది? మంచినీళ్లు త్రాగడానికీ, ఎక్కడికో తీసుకపోడానికీ ఒకే చెంబు వాడుకునే వ్యక్తి జీవితాన్నిచూచి, ఆహా! ఏమి సరళమైన జీవితం గడుపుతున్నాడు! అని ప్రశంసించే ప్రబుద్ధులను తగిన విధంగా ప్రశంసించడానికి తగిన పదాలు ఇవ్వలేకపోతున్న ప్రపంచ భాషల పేదరికాన్ని చూస్తుంటే నాకు మతిపోతోంది. అలాగే అయితే తమిళంలో క ఖ గ ఘ ఙ అన్న అయిదక్షరాలకూ 'క' ఒక్కటే ఉంది. త్యాగరాజు రచించిన ప్రహ్లాద భక్తి విజయం తమిళలిపిలో ముద్రితమైన ఒక ప్రతిని ఒకప్పుడు నేను చూడడం తటస్థించింది. అందులో క ఖ గ ఘ-లు క, $క_2$, $క_3$, $క_4$ — అని ముద్రింపబడి ఉన్నవి. ఇదే చాలా సులభమైన పద్ధతి. అంటే నా సలహా ఏమిటంటే తెలుగులో 56 అక్షరాలు ఉన్నాయి గనుక అ—అన్న అక్షరం మీద మిగత 55 అంకెలూ వేసుకుపోతే పై మార్గంలో మనం ఒకే అక్షరంతోనూ, 10 అంకెలతోనూ సంపూర్ణ ముద్రణ విధానాన్ని వచ్చినంత సింపుల్‌గాచేసి పారెయ్యవచ్చు. పరమాణువులో పరమాత్మను అంతా చూడగలిగితే ఇంక కావలసిందేముంది!

ఇంతకూ మార్పు అంటే, సార్థకం, సప్రయోజనంకావాలి. అక్షరాల సంఖ్య తగ్గితే సుళువుగా ఉంటుందని తెలుగు వర్ణ సమామ్నాయాన్ని తిరుపతి తీసుకుపోవడంకాని, — మార్పు అసలే అంగికరించము, ఇప్పుడున్న ఏ ఒక్క అక్షరంమీద చెయ్యి వేసినా ఎముకలు ఏరేస్తాం — అని బెదిరించడంగాని రెండూ మంచి మార్గాలు కావు. ఉంటే సావడిలోనూ, లేకపోతే శ్మశానంలోనే కాని ఇంకెక్కడికీ కదలడానికి వీలులేదని ఇల్లరికపుటల్లుని అత్తగారు శాపించినట్లుఉంటుంది ఈ ధోరణి.

ఈ పేచీలలో పడకుండా సహేతుకమైన ధోరణిలో ఏ మార్పులు చేసి, తెలుగు లిపిని ముద్రణకు ఇప్పటికంటె అనుకూలంగా చేయగలమో పరిశీలించాలి.

కొన్ని సూచనలు :—

I అనువైన మేరకు అక్షరాల సంఖ్యను తగ్గించేమార్గం:—

a విడిచినను ప్రమాదం లేని వర్ణములను పూర్తిగా విడిచిపెట్టడం.

b అత్యంత సన్నిహితములై, కొంచెం మార్పుచేసి ఒకే వర్ణములో సూచించుటకు అనువైన వర్ణములను అన్నింటినీ అంగీకరించడం కంటె కొన్నింటిని వదలి, వాటిస్థానే అట్టి మార్పులతో మిగత వర్ణములనే ఉపయోగించడం.

II. స్వరవ్యంజనములను జోడించడంలో మార్పు —

a వ్యంజనముపై స్వరము జోడించవలసినచోట్ల అకారానికై ఏ గుర్తునూ చేర్చకుండుట, మిగత స్వరాలకు ఎట్టి మార్పూ చేయక, అట్లే వాటిని ప్రక్కగా విడిగా వ్రాయడం.

b. ఒకటి కంటె ఎక్కువ వ్యంజనములు కలయు తావులలో కూడా ఇలాగే వానిని రూపాంతరితం చేయడం కాని, ఒకదాని క్రింద ఒకటి వ్రాయడంకాని చేయక ఒకదానిప్రక్క ఒకటి యథాక్రమంగా వ్రాయడం.

ఆంగ్లమున ముద్రణలో ముఖ్యంగా కనిపించే సౌకర్యం ఇదే కదా! వ్యంజనంలో కలిసే స్వరాన్నిగాని, ఇంకొక వ్యంజనంతో కలిసే వ్యంజనాన్నిగాని రూపాంతరితములు చేయకపోవడం, అన్నింటినీ వరుసగా ఒకదాని పక్క ఒకటి వ్రాసుకుపోవడం మనకు ఆ భాషలో కనిపిస్తుంది. దాన్ని అంతగా పొగుడుతున్న మనకు ఆ పద్ధతులు ఇష్టమన్నమాటేగ! మరి దేనికి తగువు?

పైన పేర్కొన్న సూచనలను కొంచెం వివరిస్తాను.

I a. విడిచినను ప్రమాదం లేని వర్ణాలను పూర్తిగా విడనాడడం—

ౠ, ఌ, ౡ, ఁ, ౘ, ౙ, ఱ — వీనిని పూర్తిగ విడువవచ్చు.

b. అత్యంత సన్నిహితములైన అనేక వర్ణములకుమారుగా కొన్ని వర్ణములకు కొంచెం మార్పు చేసి మిగత వాటినికూడా సూచించడం ద్వారా మరికొన్ని వర్ణాలను తగ్గించడం—

(1) హ్రస్వ దీర్ఘ స్వరాలకు వేరు వేరు అక్షరములను వాడుటకు బదులుగా అకార దీర్ఘసూచక చిహ్నము 'ా' అను గుర్తును, స్వర సాధారణ దీర్ఘ సూచక చిహ్నంగా హ్రస్వ స్వరానికి కుడిప్రక్కగా ఉంచడం. ఆ గుర్తును ఇప్పటివలె అడ్డంగా (ా) కాకుండా నిలువుగా (ɿ) చేర్చాలి.

ఇప్పటి లిపిలో కూడా అకార దీర్ఘచిహ్నాన్ని స్వర దైర్ఘ్య చిహ్నంగా మూడుచోట్ల వాడుతూనే ఉన్నాం. '‿' ఇది ఉకార చిహ్నం. దీనికీ, ఋ, ఌ అను స్వరాలకు '–' అను చిహ్నము చేర్చగానే అవి ఆయా దీర్ఘస్వరాలుగా ఏర్పడుతున్నాయి. ప్రత్యేకంగా ఒక్క స్వరానికి మాత్రమేగాక ఎక్కువ స్వరాలకుగాని స్వర చిహ్నములకుగాని చేరుతూ వాని వాని దైర్ఘ్యమును సూచించడంలో సమర్థమైన అకారదీర్ఘ చిహ్నాన్ని స్వరసాధారణ దీర్ఘ సూచకంగా వాడకోడం చాలా తర్కసంగతంగా ఉంటుంది. కన్నడంలో హ్రస్వస్వరములైన 'ఇ, ఎ, ఒ' అనువాని చిహ్నము దీర్ఘ రూపములు కేవలం '(' అను దైర్ఘ్య సూచక చిహ్నం చేర్చగానే ఏర్పడుతున్నాయి. ఇదే సదుపాయాన్ని ఇంకొంచెం విస్తరింపజేసుకుంటే మంచిదని మాత్రమే మేము మనవి చేసేది. స్వరదీర్ఘ సంజ్ఞయగు '–' అను దానిని ఇప్పటివలె అడ్డముగా కాకుండా కుడిప్రక్కగా నిలువుగా వ్రాయడంలో చాలా సౌకర్యం ఉంటుంది.

అంటే —

అ అɿ ఇ ఇɿ ఉ ఉɿ ఎ ఎɿ ఐ (లేక ఎɿɿ)

ఒ ఒɿ ఔ (లేక ఒɿɿ) అని వ్రాయవలసి ఉంటుందన్నమాట.

(2) అలాగే ఒత్తక్షరాలకు వేరు రూపములుగల వర్ణములను విడిచి, కేవలం ఒత్తును సూచించు చిహ్నాన్ని '1' జోడించి వ్రాయడం —

క క$_1$ గ గ$_1$ చ చ$_1$ జ జ$_1$ ట ట$_1$ డ డ$_1$
త త$_1$ ద ద$_1$ ప ప$_1$ బ బ$_1$

అనగా అనునాసికాక్షరాలు మినహా మిగత వర్గాక్షరాలు 20 కి బదులుగా 10 మాత్రమే ఉండి, వాటికి చేరి ఒత్తక్షరాలనుగా మార్చే ఒత్తు సంజ్ఞ వేరే ఉంటుందన్నమాట. (షకారం స్వరూపాన్ని గురించి ముందు చెప్తాగ !)

(3) ఈ క్రింది వర్ణాలను వాటికి ఎదురుగా వ్రాసిన ఇతర వర్ణాలలో సూచించడం—

ఋ — ర

(న్యాయంగా దీనిని ఇంతమాత్రంగానే వ్రాయాలి 'రు'—అనికాని 'రి'—అని కాని ఇంకో స్వరాన్ని చేర్చి వ్రాయనూ కూడదు, ఉచ్చరించనూ కూడదు. కాని ఏం చేస్తాం! రాహుకేతువులు దేవతల పంక్తిని వచ్చి కూర్చున్నట్లు వ్యంజనధ్వనిగల ఈ వర్ణము స్వర పంక్తిలో ప్రవేశించింది. ముందుగాని వెనుకగాని ఒక స్వరం సహాయం లేనిదే పలకడంలో కష్టమైనది వ్యంజనం. అలా కాకుండా స్వతంత్రోచ్చారణ సమర్థమైనది స్వరవర్ణం. స్వరపంక్తిని కూర్చోబెట్టినా, దాని స్వాతంత్రత సమకూర్చలేక ఈ వర్ణ ధ్వని ఎత్తుతున్న అవతారాలే—రు, రి అన్న రూపాలు. అరు, అరూ, అలు, అలూ అని ఋ ౠ ఌ ౡ — అన్న అక్షరాలను చదవడం, వదినించడం మీకు తెలియని రహస్యాలు కావుగా!)

(పైన చెప్పినట్లు దీనిని విడిచిపెట్టడమే శ్రేయస్కరం. అలా కాకపోతే మార్గంగా ఈ సూచన.)

ఌ — ల̣

క్ష — స̣

ఈ విధంగా అయితే ముద్రణానుకూలమైన తెలుగు లిపి ఇలా ఉండవచ్చు :—

అ ఇ ఉ (ర̣) ఎ ఐ ఒ ఔ, దీర్ఘచిహ్నము ɿ, ం, ః

క గ ఙ చ జ ఞ ట డ ణ త ద న ప బ మ, ఒత్తు సంజ్ఞ — 7

య ర ల ల̣ వ శ స స̣ హ (మొత్తం 35 ర̣—కలిస్తే 36)

మూలద్రావిడ భాషలోకి దిగజారిపోతున్నట్లుందా!

భయంలేదు తల్లి ఒడిలోకేగా!

II. స్వర వ్యంజనములలో ఒకటికంటె ఎక్కువ వర్ణములను జోడించే పద్ధతి :—

ఒక హల్లు తరువాతి స్వరంతోగాని, హల్లుతోగాని కలిసే

టప్పుడు ముందు హల్లుకు పొల్లు గుర్తు చేర్చడం. పొల్లు గుర్తు ఇప్పటి పద్ధతిలో '౯ – వలె గాక తమిళంలో వలె అక్షరంమీదుగా చుక్క '·' చేర్చడం * వ్యంజనంలోనే కవా ఇంకొక వ్యంజనంగాని స్వరంగాని చేరుతుంది !

'అ'కారము చేర్చుటకు వ్యంజనముపై ఏమీ చేర్చక అట్లే వ్రాయడం, 'ఆ'కారం చేర్చేటప్పుడు వ్యంజనంమీదుగా పొల్లు గుర్తుగా చుక్క పెట్టకుండా కుడిపక్కగా దీర్ఘ సంజ్ఞను (1) మాత్రం చేర్చడం ఈ సూచనలలో గమనింపదగిన అంశాలు. మిగత అచ్చులూ, హల్లులూ ఒక హల్లుమీద చేరేటప్పుడు దాని ప్రక్కగా స్వస్వరూపంలోనే వ్రాయబడి ఉంటాయి.

ఒక మంచి మచ్చుతునక –

ఇదిగ జిలేబి – జిలేబీ ఎంతగా పెరిగిందో!!!

(అమ్మలారా! ఈ జిలేబిని చూసేనా మీరు ఆ లొట్ట లెయ్యడం, ఆ మూతులు తుడుచుకోడం – అదిగో! అమ్మలారా! జాగా ఎక్కువ ఆక్రమిస్తున్నది ఈ లిపి – అని గుసగుసలాడుతున్నారా? అవ్వా, బువ్వా రెండూ ఎలా వస్తాయి చెప్పండి ! అహా తెలియక అడుగుతాను కదా! ఇదే ఫిర్యాదు ఆంగ్లం వ్రాసేటప్పుడు ఎందుకు చెయ్యరో? లక్ష్మి – అని రెండక్షరాలలో వ్రాసిపారేస్తే పోయేదానికి కిక్కురుమనకుండ LAKSHMI – అని సుదీర్ఘంగా వ్రాయడంలో మీ అందరికీ ఉన్న మనశ్శాంతి మా జిలేబిని చూస్తే ఎందుకు చచ్చిపోతూందో ? ఏమో! భగవంతుడికి తెలియాలి, నాకేం తెలుస్తుంది!)

ఆంగ్లంలో 1, 2 వర్గాల అక్షరాలను ముద్రణలోనూ, 3, 4 వర్గాల అక్షరాలు లేఖనంలోనూ ఉపయోగిస్తారు కదా ! (అసలు ఈ లెక్కని చూస్తే ఆంగ్లంలో అక్షరాలు 26 మాత్రమే అయినా వాస్తవానికి నాటి లేఖన చిహ్నాలు 26 x 4-104

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అ | ఇ | ఉ | ఎ | ఒ | ఐ | ఔ | ం | ౧ | 7 | | |
| అ1 | ఇ1 | ఉ1 | ఎ1 | ఒ1 | | | ః | | | | |

| 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | ౨౧ | ౨౨ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క | గ | ఙ | చ | జ | ఞ | ట | డ | ణ | త | ద | న |
| క | గ | ఙ | చ | జ | ఞ | ట | డ | ణ | త | ద | న |

| ౨౩ | ౨4 | ౨5 | ౨౬ | 27 | ౨8 | ౨౯ | ౩౦ | ౩1 | ౩౨ | ౩౩ | ౩4 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ప | బ | మ | య | ర | ల | ళ | వ | శ | ష | స | హ |
| ప | బ | మ | య | ర | ల | ళ | వ | శ | ష | స | హ |

చెప్పాలి.) వాటిని వారు వేరువేరు దిమ్మలపై కాక ఒక్కొక్కదానిపై 1, 2 వర్ణాల అక్షరాలను మలిచి తయారుచేస్తారు.

| a | b | c |
|---|---|---|
| A | B | C |

......ఇలాగన్నమాట.

ఈ పద్ధతిలో తెలుగు టైపు యంత్రంలో ముద్రలు ఇలా ఉండవచ్చు.

(ఎడమప్రక్కనున్న చిత్రమును చూడవలెను.)

9, 10 సంఖ్యల ముద్రలో స్వరదీర్ఘం గుర్తు, ఒత్తు గుర్తున్నూ, 6, 7, 9, 10 సంఖ్యల ముద్రలలో విరామ చిహ్నాలు ఉంచవచ్చు. పైని గుర్తించిన దిమ్మల సంఖ్య 34. వీటిలో సంఖ్యలు, విరామ చిహ్నాలు చేర్చబడలేదు. ఎక్కువగా ఉపయోగింపబడే అక్షరాలను దిమ్మెకు పైభాగంమీదా, అంతకంటె కొంచెం తక్కువగా ఉపయోగింపబడేవానిని అడుగుభాగంగానూ గుర్తించడం ద్వారా ముద్రణలో సహాయం ఉంటుంది. దీర్ఘ స్వరాలకంటె హ్రస్వ స్వరాలూ, అకార సహిత వ్యంజనరూపాలకంటె అకారరహిత వ్యంజన రూపాలూ లేఖనంలో ఎక్కువగా ఉపయోగింపబడతాయి. అందుకే పై విధంగా గుర్తించడం జరిగింది.

ఒత్తు గుర్తు '1' వంటి గీతగా కాక '7'వలె ఏడు సంఖ్యను పోలి, అక్షరం కుడిప్రక్క క్రిందిభాగం తాకుతూ ఉంటుంది. చేరిన అక్షరంతో అతికిఉండాలని '7' అన్నట్టి గుర్తు రూపొందించబడింది. ఇదీ, దీర్ఘచిహ్నమూ రెండూ వేరుముద్రలపై ఉండటంచేత ఏ అక్షరంపై చేర్చవలసివచ్చినా వేరొక దిమ్మె నొక్కి ముద్రించవలసి ఉంటుంది. ఐ, ఔ— లను వేరె ఆమోదించడానికి బదులు ఎ11, ఒ11 - అని ఎ, ఒ-లకు రెండేసి దీర్ఘచిహ్నాలను జోడించడం ద్వారా సూచించదలచుటంచే నా అభ్యంతరంలేదు. కాని మార్పులు ఇప్పటి స్థితికి చాలాదూరం తీసుకుపోవడం జరుగుతుందేమో అని చిన్న భయం.

సూచనలు ముగిసినవి —

ఇవి వీళ్ళ కలపని పాలే అని అపోహపడుతున్నారు. (ఆఁ ఆఁ వినిపిస్తోంది. పాలు కలపని నీళ్ళే—అని గొణుగుతున్నారు! ఆఁ ఏమది? లేదు—లేదు—అంటున్నారా? సరే, తథాస్తు!)

ఒకవేళ ఏమైనా కలిసినా పాఠకులు హంసల్లా, రాజహంసల్లా కదా! ఫరవాలేదు—అని ఒక మొండి ధైర్యం!!

— స రి గ మ ప ధ ని స —

అపస్వరాలు పలకడం లేదు కదూ!

జయం

("ఆ పరితోషాద్విదుషాం న సాధు మన్యే ప్రయోగ విజ్ఞానమ్.")

---

* ఇక్కడ పరిచితమైన గుర్తే వాడుతాం — అంటె వ్యంజనంమీద పైని సూచించినట్లు తమిళంలో వాడుతున్నట్లు చుక్క ఉంచడానికి బదులు పొల్లు '‿' ఉంచడం ఒక పద్ధతి. లేదా తరువాతి స్వరంలోగాని (ం, ఆ-లు తప్ప) వ్యంజనంలోగాని కలిసే వ్యంజనానికి కుడిపైపుగా కొనసాగింపు గుర్తు '–' చేర్చి వ్రాయడం రెండవ పద్ధతి. ఈ రెండింటికంటె చుక్క చేర్చడమే సులభంగా ఉంటుంది.

కాస్త చుక్క తగిలిస్తే మంచిదని ముందే చెప్పేగా!

మూడింటికి ఉదాహరణలు : (1) మలలివ పవివవఉ. (2) మల్ల్వ 'వ్'ఉవ్వ్డ (3) మల–ల–వ వు-ఉవ–వ–ఉ. (ఒకప్పుడు మొగలి పువ్వుకి వచ్చిన గతి ఇప్పుడు మల్లెపువ్వుకి పడుతుందేమో— అని ఎవరో అంటున్నారని మీరంటున్నారా? ఛ! ఛ!! నేను నమ్మను. చూస్తూ చూస్తూ వాళ్ళెవరూ సరిపడా ఉంచేకరు మాత్రం ఎందుకంటారండీ అలాగ!)

# రాయలవారి వ్యవసాయాభిజ్ఞత

శ్రీ కనమలూరు వెంకట శివయ్య

శ్రీకృష్ణదేవరాయలు ఒక అపూర్వమైన వ్యక్తి. రాజుగానే కాక కవిగా పేరు ప్రఖ్యాతులు పొందినవాడు. కదనమున కరవాలమును ఎంత సులభముగా త్రిప్పగలడో, కవనమున కలమును అంత సులభముగా నడుపగలడు. కదనమున మత్తేభయానము కవనమున మత్తేభ విక్రీడితము రమణీయములైనవి. కదనమున ప్రాస ప్రయోగము కవనమున ప్రాస సంయోగము ప్రశంసార్హమైనవి. మల్ల యుద్ధమున సీసబంధము కావ్యమున సీసపద్యబంధము సమగ్రతతో నిర్వహించును. కదనమునగాని, కవనమునగాని రాయలవారి రీతి ఒక ప్రత్యేక వైభవము, వైశిష్ట్యము కలిగియుండును, కదనమున విజయ పతాకమును, కవనమున కీర్తి వైజయంతికను ఎగురవేసిన రాజకవి రాయలవారు. అందుకే సాహితీ సమరాంగణ సార్వభౌమ బిరుదాంచితులయినారు.

కవిత్వ తత్వము సామాన్యముగా ఆ కవియొక్క మనస్తత్వము వృత్తి ప్రవృత్తి అనుభవము వీనిపై ఆధారపడియుండును. కవి ఉపయోగించు ఉపమలుగాని, ఉత్ప్రేక్షలుగాని అతని అనుభవమునకు ప్రతీకలుగానుండును. రాయలవారికి, తక్కిన కవులకంటెను లౌకికానుభవము ఎక్కువ అని చెప్పవచ్చును. రాయలవారు తన రాజ్య నిర్వహణమున ఎన్నిమారులు ఆయా శాఖలందున్న ఉన్నతాధికారులతో చర్చలు గావించిరో! ఎన్ని పరదల జూచిరో; ఎన్ని క్షామముల గాంచిరో; ఎన్ని మారులు సంగీత సభలకు అధ్యక్షత వహించిరో! ఎన్నిమారులు విదేశీయ పరరాజ్య వాణిజ్య బృందములతో "వస్తు మారక" (exchange) వాణిజ్య విశేషముల చర్చించిరో! ఎన్ని మారులు మత పీఠాధిపతులతో వేదాంత రహస్యములను చర్చించిరో! ఇవి కేవలము ప్రతిభా వ్యుత్పత్తులుగల, ఒక కవి మాత్రునకు అందని అందుబాటులో లేని సంఘటనలు. పై కారణముచే రాయలవారి కవిత్వము రాచముద ఎల్లెడ కాననగును. వారి వర్ణనలలో స్వాభావికత, సూక్ష్మ పరిశీలన అనుభవసారము సుస్పష్టము.

రాయలవారి కవిత్వ తత్త్వమును, ఆనాటి తక్కిన కవుల కవిత్వ తత్త్వమును ఈ క్రింది ఉదాహరణలతో తెలియనగును.

పెద్దనాది కవుల కవిత్వమును చక్కని సుందర నందన వనమునకు పోల్చిన రాయలవారి కవిత్వమును ఏపుగా పెరిగిన ఒక మహారణ్యమునకు పోల్చవచ్చును. నందనవనమున చక్కగా దిద్దితీర్చిన పూదేనియ యేటి కాలువలు, చెంగల్వ పుష్పాళ్ళు, చంద్రోపల వేదులు, పొన్నలు పొగడలు ఉండును కాని మహారణ్యమున స్వాభావిక సౌందర్యము కాననగును. ఇతర ప్రబంధ కవుల కవిత్వమును ఒక నాగరిక విలాస మందిరమునకు పోల్చిన, రాయలవారి కవిత్వమును, ఒక గ్రామ ధనికుని విశాల మందిరమునకు పోల్చవచ్చును. ఇతర కవుల కవిత్వము గంగా యమునా గోదావరి ఇత్యాది నదీ విశేషములయిన, రాయలవారి కవిత్వము రమ్యగంభీర సముద్రము అగును.

రాయలవారి ఆముక్తమాల్యదను చదివిన, ఆ గ్రంథము బహుముఖ వైభవోపేతముగా నున్నట్లు తెలియును. రాయలవారి అవక్ర లోకానుభవము, సూక్ష్మపరిశీలన బహుశాస్త్ర పారీణత కావ్యగమనమున పాదపాదమున కన్పడుచుండును.

రాయలనాటి ప్రబంధ కవులలో ఎవరుగాని వ్యవసాయమును గురించి అంతగా పట్టించుకొనినట్లు కనపడదు. ఆంధ్ర కవితాపితామహుడనిపించుకొనిన పెద్దనకూడా కర్షకుని గురించి ప్రత్యక్షవర్ణన గాని పరోక్ష ప్రసక్తిగాని చేయలేదు. రామరాజ భూషణుడు మాత్రము తన వసు చరిత్ర కావ్యమున, వ్యవసాయమునకు సంబంధించిన వర్ణనలు జేసి యున్నాడు.

రాయలవారు తన కావ్యాభరణమున, కర్షక జీవితమునుండి సంఘటనలు సన్నివేశములు అను మణిరత్నాదులను అతి మనోహరముగా పొదిగియున్నారు. కర్షక జీవితమున విత్తనము చల్లుట మొదలు పంట ఒబ్బిడి చేయునంతవరకు కల విశేషములను గీతాను

గతికముగా తీసికొని రాయల వారు ప్రదర్శించిన వ్యవసాయాభిజ్ఞతను తెలిసికొందము.

## భూమిని పదును చేసికొనుట

ప్రతి రైతు, క్రొత్తగా భూములను సంపాదించుకొనుట, అతి ముఖ్యముగా చేయుపని. రాయలనాటి కాలమున, భూమిపై ఈనాడున్నంత ఒత్తిడి ఉండి ఉండదు; కావున ప్రభుత్వపు భూములను ఆక్రమించుకొని షడంశమును పన్నుగా కట్టియుందురు. అట్లు ఆక్రమించుకొనుటకు ముఖ్యముగా మెట్ట పొలములు ఏ కొండ చరియల లోనో, అరణ్యసమీపముననో లభ్యమగును. ఆవిధముగా ఆక్రమించు కొనునప్పుడు, ప్రతి కర్షకుడు ఆ భూమిచుట్టూ కంచెవేసుకొనును. తర్వాత భూమిపైనున్న చిన్నచిన్న తుప్పలను సమూలముగా తీసివేయును. రాయిరప్పలను ఏరివేయును. గుద్దలితో త్రవ్వి భూమిని సమతలముగా దిద్ది తీర్చును. పై సూక్ష్మమైన కార్షిక విషయములను, తాను ఎన్నిమారులు న్యాయనిర్ణేతగా చూచెనో! యామున ప్రభువు పుత్రునకు రాజనీతి బోధించు సందర్భమున, పై అనుభవ సారమును ఎంత రమణీయముగా అనుసంధించిరో క్రింది పద్యమున తెలియనగును.

మును దనసీమ చేసికొని ముళ్ళిది, గుద్దట వెండివేని పె
త్తన కయి, వేరు వెళ్లకియుఁ ద్రవ్వెడు కర్షకునట్లు, శత్రులో
నెనసి యుపాయాన దుర్గబలమే కొనిప్రాన నిజాత్మ చింత లే
క నెగడఁజేసి లోన మరి కంటక శోధనఁజేయు టొప్పగున్

ఇటు రాజనీతికి చెందిన రహస్యములను అటు రైతు జాతికి చెందిన విశేషములను, తన ధిషణాటోపముతో, ఎంతో సునిశితముగా నతికెను.

## భూమిని దున్నుట

గ్రీష్మమున భూమి బాగుగా కాగి బీటలు వారును. గ్రీష్మానంతరము వర్షము ప్రారంభమగును. భూమి మెత్తవారును. దున్నుట చాల సులభమగును. చెరుచేలను దున్నుటకుగూడ అదే సమయము. మొదటి వర్షపు తేమ నాలుగైదురోజులు మాత్రముండును. ఆ కొలది వ్యవధిలో, గ్రామమున గల మొత్తము భూమి దున్నకము గావలెను. అందుకని గ్రామమునన్న ఎడ్లు, దున్నలే కాక, వట్టిపోయిన ఆవులు బత్తెంపుగూడ నాగటికి పూంచుట నడనడ కన్పడును. మరియు, పెరక చేలను దున్నుట దున్నలకు కష్టము. రొంపిలో దున్నుట ఎడ్లకు కష్టము. పైన తెల్పిన సూక్ష్మ, వ్యవసాయ వివరములను, ఎంతో హృద్యముగా, క్రింది పద్యమున ఉత్ప్రేక్షించిన కీర్తి రాయలవారికి దక్కినది.

కాలుని దున్న నందినయి గంటలు దున్నక మంటినా మహా
కాలుని నంది దున్ననయి కర్దము మస్తతలేక మంటినా
హాలికు లెన్నడుం దెగని యేరులు చేయును జేసమళ్లపం
గాలి నెరుసాగిరిలఁ గల్గు ఫలం గొని పేద మున్నుగన్

రాయలవారు ప్రతి ఆశ్వాసాంత పద్యమున ఆ యాశ్వాసము హృద్యముగా నుండునని తన నమ్మకము తెల్పియున్నాడు. పై పద్య రచన మూలముగా, నాలుగవ ఆశ్వాసాంత పద్యమున గల పలుకులు "..............ఆశ్వాసవరంబు నాలవది హృద్యంబై మహిం బొల్పగున్" సత్యమ్ములాయెనని ఘంటాఘోషముగా పలుకవచ్చును.

సేద్యమున రొంపి దున్నుట చాల కష్టమయిన పని. దానికి చాల అనుభవము సమర్థత కావలయును. అందున గనిమ వెంబడి దున్నుట ఇంకను కష్టమైన పని. కందమును వ్రాసినవాడే కవి; పందిని పొడిచినవాడే బంటు అన్నట్లు, కర్దమమున దున్నినవాడే కర్షకుడనవచ్చును.

రొంపి దున్నినపుడు నీటిపాములు గనిమలకు ఉన్న బిలములలో చేరును. గనిమ వెంబడి దున్నునపుడు అవి వచ్చి సేద్యగాని కాళ్ళకు చుట్టుకొనును. ఈ వాస్తవికతను రాయలవారు హృదయ వైద్యముగా ఉత్ప్రేక్షించిరి. కాలికి చుట్టుకొనియున్న ఆ పసుపు పచ్చని నీటిపాము, తన ఊహాపథమున కనపడగనే, అనేక సాహితీ వసంతోత్సవములు, కవిసన్మానములు, గండపెండేరములు, రైతుసన్మానములు పసిడి కడియములు గిఱ్ఱున తనమేధలో తిరిగియుండును.

ఫలితమే క్రింది పద్యము.

వరజాఁ బడి రొంపిఁ దొక్కం
జరణంబులఁ జుట్టి పసిడి చాయ కడెంపులం
బొరి నీరు కట్టులమరెను
బిరుదులు హాలికులు దున్న పెట్టరో యనఁగన్ ,

## వి త్త న ము లు

వ్యవసాయమున విత్తుట ఒక ముఖ్య కార్యక్రమము. మంచి పంటకు మంచి విత్తనము అవసరము. ఎంతటి పేద రైతయినను, పంట నూర్పిడికాగానే, మంచి గింజలను వేరుచేసి, ఎండబెట్టి వానిని బానలలో భద్రముగా దాచి యుంచును. ఈ విషయమును, గ్రీష్మ కాలమున చలి పందిరిలోనికి ప్రపా పాలికలు, కడవలలో నీరు తెచ్చు ఘట్టమున, ఉత్ప్రేక్ష రూపమున, అతి మనోజ్ఞముగా, క్రింది పద్యమున, తెలిపియున్నారు.

సుడిగాడిచ్చలనన్ సరోజములు చదుః ప్రవకితాన్నాచు క్రొ
మ్ముడి దంభంబున చక్రఫేన పటలంబు ల్బన్నులున్నవ్వుగా
నడరంచేసి నిదాఘ భీతి సలిలం బాగామి బీజార్థమై
కడవంబెట్టిన వారి దేవతలు నాఁ గాంతాళి యొప్పన్ ప్రపన్.

వరి ధాన్యమున నున్న బహువిధములు మరి ఏపంటయందును లేవు. విలుబుట్టారు వర్ణించు సమయమున, రాయలవారు ఒక చమత్కారమును ప్రదర్శించుచు, వరి ధాన్యమునగల వేర్వేరు వంగడములను, ఈ క్రింద పద్యమున తెల్పియున్నారు.

సారిదిం బేర్చిన తీగ మల్లియలు ఖర్జూరంబులున్ పుష్పమం
జరులున్ మామిడి గుత్తులున్ కుసుమముల్ సంపంగెలున్ పచ్చగ
న్నెరులున్ బాళలు గర్గి రాజనపు గాంతిం దారుముల్సాసి చే
లరు దారన్ నగు పూవుదోటల బలాకానీ కదంబంబునన్

రాయలవారికి, వరి ధాన్యమున ఇన్నిరకములు తెలియుననిన, వారికి వ్యవసాయమున ఎంత లభిజ్ఞత కలదో సువ్యక్తమగును.

## నీ టి పా రు ద ల

వ్యవసాయ కార్యక్రమమును, నీటిపారుదల ఒకముఖ్యాంశము. రాయలవారు ఎన్నియో నీటి వసరుల పథకములను ప్రజా సంక్షేమము నకై తయారుచేసి దేశమును సుభిక్షము గావించినారు. ఈనాటికి రాయలసీమయందు ఎన్నో చెరువులు "రాయల చెరువు" అను పేరుతో వ్యవహరింపబడుచున్నవి.

పైర్లకు నీరు పారించుట రెండు రకములుగా నుండును. పల్లపు భూములకు, చెరువు నీరుగాని నది జలములగాని, నీటి వాలునుబట్టి పారింతురు. మిట్టనున్న పొలములకు, కపిలె ద్వార గాని, ఏతము ద్వార పారింతురు.

పల్లపు పొలములకు నీరు పారించుట, ఈ క్రింది పద్యమున తెలియనగును.

లలి పచ్చపట గుచ్చి బాటువులు కేదారంపు గుల్యాంతర
స్థలి నిద్రింపగ జూచి యారెకు లుషస్స్నాతప్రయాల ద్విజా
వలి పిండీకృత శాటికల్ సవి దదావాసంబు చేర్పంగరే
వుల విగ్గన్ మొనారువానిగని నవ్వన్ శాలి గోప్యోఘముల్

ఈ పద్యము రాయలవారి కవితా శిల్ప కిరీటమునకు కలికితురాయి వంటిది. స్వభావసిద్ధమైన ఒక సంఘటనను తీసికొని, ఒక స్వభావ శక్తికి, ఒక భ్రాంతిమంతమునకు రమణీయమయిన లక్ష్యభూతమయిన అలంకార జగత్తును నిర్మించిరి. ఈ పద్యముం జూడ, రాయలవారు ఏదో ఒకనాడు, తాను కేదారంపు కల్యాంపు సలిలంబుల ఉషస్స్నాతులై ఉదయ భాస్కర ప్రభారోచిస్సులలో పులకరించియుందురు. పై పద్యమున తెల్పిన సన్నివేశమును తన కన్నులార గాంచి, డెందమున అమందా నందంబు పొందియుందురు. లేదా తాను నిర్మించిన చెరువులనుండి నీటి పారుదల ఎట్లు జరుగుచున్నది. చూచుటకుగాని లేదా, కర్షకులకు, నీటి, వినియమమున వచ్చు కలహముల దీర్చుటకుగాని స్థల పరిశీలన జేసియుందురు. కారణమేదైన గావచ్చు. తాను స్వయముగా చూసి యుండినగాని ఇటువంటి అతిసూక్ష్మములగు వివరములు తెల్పుట కష్టము.

మిట్ట పొలములకు నీరు పారించు పద్ధతినికూడ, రాయల వారు స్వయముగా జూచియుందురు. కపిలెగాని ఏతముగాని, తెల్లవారు జాముననే ప్రారంభింతురు. ఏతము త్రొక్కువారుగాని, కపిలె తోలు వారు గాని చక్కని జానపద గేయములను కర్ణరసాయనముగా పాడు చుందురు. ముఖ్యముగా వారి పాటలయందు దీర్ఘాలాపన వినబడు చుండును ఒక్కొక్క స్వరమునందు కాచి పాడుట మరొక విశేషము.

తెల్లవారుజామున, ఎండకాలములలో పై విధముగా నీరు పారించుచుండగా, మడుగు కాలువల మధ్య ఉన్న ప్రదేశమున పాటల పుష్పరాశులు సురటి చుచుండగా భూమి బాగుగా తడిసినందున, మనోహితమైన శీతలవాయువులు సోపుచుండ, ఏతము త్రొక్కువారి

పాటలు, వానికి అనుగుణమైన వాద్యవిశేషమా యని తోచుచున్న కుంభోద్భవనోద్భూతాంబు ధ్వని, వినుటకు ఎంతో హాయిగానుండును. దీనిని రాయలవారు అనుభవించి ఈ క్రింది హృద్యమైన పద్యమును వ్రాసినారు.

ప్రాతర్వేళల సట్టివెట్ట గన్నై పాటిర్లోన సాగు భోంబనో
ద్భూంతాంబు ధ్వని వాద్యమై మరుదధః పుంభీవలాటుల
వ్రాలామేరిత సిక్త భూసురదిశానామంబు కుల్యబహూ
స్రోత స్సంధుల నందు యంత్రతనలిస్రోత్పద్గీతగేయౌఘముల్

## పండిన వరిపంట

వరిపంట బాగుగా పండినయెడల, గింజ గట్టిపారి యుండును. గింజ కొన భాగమున సన్నని కంటక ప్రాయమైనది ఒక విశేష ముండును. ఈ వాస్తవిక లౌకిక సంఘటనను, ఒక అపూర్వ అలౌకిక రమణీయ దైవ కార్యముతో ఉత్ప్రేక్షా మధురతతో రంగరించి, మధురమైన ఈ క్రింది పద్యశ్లేషమును పాఠక భోక్తలకు అందించి సార్థకమైన సాహితీ సమారాధన జేసినారు రాయలవారు.

నీరజేక్షణు డర్వేళ నీ దదెలిసి
యుదుగు తనమీద మోపెనో యవని రమణి
కంటకితగాత్రి యయ్యె నా గా విపాక
పరుష కంటక శాలి మంజరులు వొలిచె

## వరిపంటను కోయు పద్ధతి

వరిపంట పండునంతవరకు నీరు సమృద్ధిగా నుండవలెను. కాని పైరుకోయుటకు వారము ముందు నీటి పారకము ఆపవలెను. దీనికి రెండు కారణములు కలవు. ఒకటి గింజలో చేమలగ్గి, గట్టి పడును. రెండు, పొలమున బురద ఉండదుగాన పైరుకోయుట సులభము.

బాగుగా పండిన వరిపైరు, గాలివాటునుబట్టి ఒక ప్రక్కకు వంగును. వెన్ను భారమున నిటారుగా నుండజాలదు.

శ్రీకృష్ణదేవరాయలు పై విషయమును క్రింది పద్యమున చాల రసవంతముగా చెప్పియున్నారు.

బలసిన హళ్లకచ్ఛటలపై తమ జుంజురు ముంచు రాయగా
గలమములుండు బందియె అంగుంబడి నీరెదురింప ధ్వానలో,
దలకొని వంగిముంజలము క్రావెడు క్రిందటి వెన్నుమీదటన్
నిలిపి మరందమాను కరటేన్ నికటోపవనానిలాహతిన్.

ఎంతటి సూక్ష్మ పరిశీలన! ఎంతటి మధురానుభూతి! ఎంతటి మహత్తర హృదయస్పందనము! ఎంతటి మంజుల భావ నిర్గమనము!

## గడ్డివాములు

గాలికి పీగపోకుండ ఎత్తైన వాములు వేయుట ఒక కర్షక శిల్ప విశేషము. గ్రామమునందలి ఎత్తైన వాములను క్రింది పద్యమున చాల రమణీయముగా, చమత్కారయుతముగా ఉత్ప్రేక్షించినారు రాయలవారు.

నింగి యుర్వీందామహా నీలమైన
గరిక కుందగ బహుతృణ గాహియయ్యె
ననగ బరిణత కలమాది యవసరాశి
తతులు గిరులన నభ్రంకషత జెలంగె

రాయల వారికి ఉల్లము పొంగినపుడెల్ల, ఉత్ప్రేక్షాలంకారము ఉరకలు వేయుచున్నట్లున్నది. వారి కవితా వల్లికయందు అడుగడుగునా ఉత్ప్రేక్షా సుమములు విరియబూచి, రంగుల వైభవముతో, గంధపు ప్రాభవములో కావ్య నందనమునకు ఒక క్రొత్తయందమును కూర్చు చుండును.

## సజ్జ ఇత్యాది ధాన్యముల నూర్పిడి

సజ్జలు సాధారణముగా పునర్వసు కార్తెయందు చల్లబడును. అవి భాద్రపదమున పంటకు వచ్చును. మంచి వానరోజులు. "కళ్లము" ఏర్పాటుచేయుట ఒక సమస్య. అందుకని సజ్జ కంకులు ఒక కుప్పగా వేసి వాన తగులకుండనట్లుగ చేయుదురు. పొలములలో చిన్నచిన్న పాకలు వేసుకొని కావలి యుందురు. సన్న రైతులకు నిత్యావసరములకు, పైరు ఒబ్బిడి చేసినగాని కుదరదు. అందుచే నిండు కళ్లములలో, ఎడ్లచే కంకులను త్రొక్కించి నూర్పిడి చేయు

వరకు, కొలది కొలదిగా కంకులను తీసి చేతులతో పిసికి, గింజలను వేరుచేసి నిత్యావసరముల దీర్చుకొందురు.

గ్రామ జీవితము కర్షక జీవితము బాగుగా తెలిసినగాని, పై సంఘటనలు తెలియ రాదు. రాయలవారు, ఏతద్వివరములను క్రింది పద్యమున అతి మనోజ్ఞముగా వర్ణించియున్నారు.

పసుపుల్ నెల్వడి వానకై గుడిసె మోదన్ రాక తానాని యే
పసగా నిల్చిన జమ్ముగూడఁ బొలమంబళ్ మోచుచుంబట్టి పె
న్ముసురున్నిగెడు కాపు గుబ్బెతల పెనుబ్బల్ పునావల్ వెలిం
బిసికిళ్లం బిసికిళ్ల హాలికుల కర్పించెన్నభస్యంబునన్

పై వర్ణన గాంచి శ్లాఘా శిరఃకంపము జేయని రసికుడుండడు.

ఆ ముసురు వేళలో శీతల సమీర కిశోరములు సోకుచుండ, నారీ పరీరంభమున నాక సౌఖ్యము నందుకొనవలసిన కర్షకులు, పాపము పాకలలో, పడతుల పొందులేక పడరాని ఇడుముల పడుచున్నారు. ఉదయమున గుబ్బెతలు, అంబలి తీసుకొనిరాగా, స్మరాప స్మారమునకు లోనయిన హాలికులకు ప్రాణములు లేచివచ్చినవి. కంకులు పిసుకుట మాని కాంతాకుచ మర్దనము గావించిరి

రాయలవారు పై పద్యమున తమ వ్యవసాయాభిజ్ఞతతో రసికతా భావమును మేళవించి, ఒక రస జగత్తును నిర్మించినారు! హాలికుని రసరాష్ట్ర సమ్రాట్టుగా జేసినాడు.

పైన ఉదాహరించిన వర్ణనలన్నిటిని జూడ రాయలవారికి వ్యవసాయమున గల్గు రోటుపాటులన్నియు కరతలామలకములుగా నున్నట్లు తెలియును.

రాయలవారు, తన కావ్యరంగమున హాలికులకు ఉచితస్థానము నొసంగినారు. వారి కవితా కన్యకాంచిన నృత్యములో, కమనీయ కార్షిక విన్యాసములు కూడ కానవచ్చు.

రాయలవారు తన కావ్యగానమునకు, కార్షిక శిల్ప విశేషములను ఉపశ్రుతులుగా నెంచుకొనారు.

మొత్తముమీద కర్షక క్రియావిశేషములను, తన పలుకు దివ్వెలలో లోకములకు ఎత్తిచూపినాడు.

రాయలవారి సాహితీ కేదారమున కర్షక జీవిత కలమము పండి ఒరుగంబడినది.



# కలగూరగంప

## దుర్యోధనుఁడురగకేతనుఁడా ?

పై శీర్షికగల వ్యాసమొక్కటి 1975 ఆగస్టు నెల 'భారతి'లో ప్రకటింపబడినది.

వ్యాసమును పంపిన నాటినుండి ప్రకటన మగువఱకు దాని విషయమై వ్యాసభారతమును పరిశీలింప దొడగితిని. ఎందుకనగా ప్రకటితమైన నా వ్యాసములో నీ క్రింది వాక్యములు నన్ను పరిశీలనోన్ముఖుని గావించినవి.

"పై నుదాహరించిన కన్నడ కావ్యములందు కనబడు భీముని సింహధ్వజమునుబట్టి, నాగధ్వజవిషయమూహ చేయుట కవకాశమున్నది."

"భీమ దుర్యోధనుల వైరము ప్రసిద్ధమైనదిగదా!......... సింహనాగధ్వజములు వారి వైరమును తెలుపగలవని యూహించి నచో నాగశబ్దమునకు ఏనుగను అర్థమునే చెప్పవలసియుండును. అట్లు చెప్పుటవలన ఔచిత్యమును పాటించినట్లగును."

"కాని యొక సందేహము కలుగకపోదు భీముని సింహధ్వజ వృత్తాంతము కన్నడ కవులు మాత్రము వ్రాసి యున్నారు. వారటు రచించుట కేది యాధారమో తెలియుటలేదు. వ్యాసభారతమునందు భీముడు కేసరి కేతనుడుగా చెప్పబడినట్లు లేదు......"

వ్యాసభారత పరిశీలనము ఫలదాయకమైనది.

ఈ క్రింది శ్లోకములు నా దృష్టికి వచ్చినవి.

పూర్ణాయత విసృష్టేన క్షురేణ నిశితేనచ |
ధ్వజమేకేన చిచ్ఛేద భీమసేనస్య పత్రిణా॥ 32

జాంబూనదమయః కేతుః కేసరీ వరసత్తమ |
పపాత భీమసేనస్య భీష్మేణ మథితో రథాత్॥
[భీష్మపర్వాంతర్గత భీష్మవధ పర్వణి సప్తచత్వారింశో ధ్యాయః] 33

గీతా ప్రెస్సు, గోరక్‌పూర్ వారు ప్రకటించిన వ్యాసభారతము నందీ 33వ శ్లోకముందలి పూర్వార్ధ శ్లోకము ఈ రీతిగా గలదు.

'జాంబూనదమయః శ్రీమాన్ కేసరీ స నరోత్తమ'

ఉత్తర ప్రతిలో శ్రీమాన్ అని కలదు కేతుః అనునది అధ్యాహార మవసరించుచున్నది. కాగా అర్థభేద మేమాత్రములేదు.

దీనివలన వ్యాసులవారు భీముని సింహధ్వజునిగా చెప్పి యున్నారు.

ఈ శ్లోకమునకే తిక్కన్నగారి యనువాద మీ రీతిగా గలదు చూడుడు:—

గీ॥ సింహనాదంబుతో భీమసేనుడవ్వ
దనుజ తనయుని చేకొని యరిబలంబు
దరల దాకిన నతని యుత్తాల సింహ
కేతనము గూల్చె సురనదీ సూతి యరిగి॥

భీష్మ. ప. ప్రథమాశ్వాసము. 276

మూలభారతమునందు, తిక్కన భారతమునందు భీముడు కేసరికేతనుడుగా వర్ణింపబడియున్నాడు. మూలభారతము ననుస రించి కన్నడకవులు పంపడు, రన్నడు, - భీముని సింహకేతనునిగా చెప్పియున్నారు.

దీనివలన నింతవఱకు నూహించినట్లుగా దుర్యోధనుడు గజ ధ్వజుడుగానే చెప్పబడవలసి యున్నది. ఇది కేవల మూహయనుట కంటె యదార్థమైనదనియే నిర్ణయింపవచ్చును.

భీముని కేతనము సింహకేతనమని వ్యాసుడు చెప్పుటవలన దుర్యోధనుని కేతనము గజధ్వజమని నిర్ణయించుట సమంజసముగా దోచుచున్నది.

దాక్షిణాత్యుల సర్పార్థమునకంటె, ఔత్తరాహుల గజార్థమే సమంజసమైనదని తెలుచున్నది.

పండితులీ విషయమును గూర్చి చర్చింతురు గాక.

—శ్రీ ఏరూరు సీతారామశర్మ

## సురభి

"అరి సొత్కృత సురభి పరాళి సురభి, సుగుణనరీ ప్రకాం డైక సురభి"—అని కీర్తినందిన సురభివంశము తెలుగుదేశమున

సూర్యవంశముకును ఇక్ష్వాకు-కకుత్స-రఘువంశములని పేరందినటుల రేచర్ల-పిల్లలమఱ్ఱి-దేవరకొండ-రాచకొండ-జటప్రోలు-వెలుగోడు బొబ్బిలి-వేంకటగిరి-పిఠాపురము మున్నగు పెక్కు వంశములకు కుదురై జమీందారీ కుటుంబములకు నెలవై, తెలంగాణమున గల పెక్కు వెలమదొరల కుటుంబముల కాలవాలమై ఇటుల శాఖోప శాఖలై విస్తరిలినది. గద్వాల ప్రభువులు గూడ సురభివారనే చెప్ప దురు. వెలుగోటివారి వంశచరిత్ర, రావు వంశీయ చరిత్ర జటప్రోలు మరియు గద్వాల సంస్థానముల చరితలు వ్రాసిన పరిశోధకులవి సురభి వంశములేయని యంగీకరించిరి గాని ఆ సురభి యెచటనున్నదో పరిశీలించినటు లేదు.

కొందరీ సురభిని "గోదలు"నకు సంస్కృతీకరణమని భావించిరి గాని నేడు నాగర కందనూలు తాలూకాయందలి కారువంగ లాళ్ళ పలి గ్రామముల నడుమ సురభి, లచ్చంపేట తాలూకాలో బలు మూరు మరియు నేటి గోదలు గ్రామముల నడుమ గుడ్డటి మిట్ట పేర ప్రాచీనమైన గోదలు జాడలున్నవి.

స్థానికులు జెప్ప కథనమునుబట్టి సురభి యీ ప్రాంతమున మిక్కిలి గొప్పపట్టణము. దాని వైశాల్యము సుమారు మైలునర అది దుందుభీ కారువంక నల్లవాగు-నదుల సంగమ స్థానమున కించుక పైన నుండెను. సురభి వైభవముగనున్న కాలమున దుందుభీ తీరమందలి రామగిరి గొప్ప జైనక్షేత్రము. దానిని భీమ చోడుని సోదరుడగు గోకర్ణుడు పాలించుచుండినట్లు ప్రజా కథనము. దాని కీవలివైపున నేడు కారువంగ గ్రామము వెలుపలగల శివాలయమున సూర్యునకు ప్రత్యేకాలయ ముండెను. అందెఱ్ఱని రాతితో మలచబడిన సూర్యవిగ్రహ ముండెను. జనులు సూర్యగ్రహణ పుణ్యకాలమున నల్లవాగునందు స్నానమాడి అచటి సూర్యదేవు నభిషేకించుచుండిరి. నేడా మూర్తి భిన్నమై నిలిచినది.

సురభి నానాడు వెలమలు పాలించుచుండిరి. పరిపాలనయందు వారిదొక విశిష్టమైన పద్ధతి. వారు తమ రాజధానులను తీరిగానే గాక సకల సౌకర్యోపేతముగా రూపొందించు కొనుటకై సమాజమున గల వివిధ వృత్తుల వారిని రావించుకొని వారికి మడులు మాన్యము లిచ్చి పోషించుచుండిరి. అందువలన నాటి సురభియందు లేని పని వారుగాని, నివసింపని జాతులుగాని లేరు. అచటి కమ్మరులు, వండ్రంగులు, కంచరులు, సొన్నారులు, పద్మశాలీలు, మేదరులు, కుమ్మరులు ప్రతివారు తమ తమ వృత్తులయందు నిపుణులై యుండిరి వారేగాక అంతఃపుర పరిచారికా గణమునగల వంటలవారు నాలా కారులు గాంధికులు గూడా సర్వదులై యుండిరి. ఎవ్వరియందును తీసివేయదగినవారు లేనే లేకుండిరి. ఆ కాలమున వివాహములకు గావలసిన వస్తు వాహనములు సంబారాదులు ఒకేచోట దొరికెడివి గావు. కొన్నిటిని వారి వివిధ ప్రదేశములనుండి సమకూర్చుకొనవలసి యుండెను. సామాన్యుల వివాహములందే యిట్లుండ నిక రాచవారి వివాహములను గురించి యడుగవలసి యుండదుగదా! కాని వివాహములు తలపెట్టుకొన్న రాచవారికి సురభి పొరకు నామము గలదై వలసిన వస్తువులన్ని వలసిన మేరకు పొలిమేర దాటకుండా దొరకు చుండెను. ఇది అనాటి సురభికి సాని కొరిచ్చిన సరిఫికెట్టు.

ఇట్టి సంపద్భరితమైన పట్టణమే కారణమున రూపడెనో కచ్చితముగా దెలియదు. ఈ ప్రాంతమువారు కాకతి రుద్రదేవుని వర్ధమాన పురదండయాత్రాసందర్భమున భీమచోడుని కాశ్రయమిచ్చి రని దుని యాగ్రహమునకు గురియయ్యెనని చెప్పుదురు. ఈ దండయాత్ర యెప్పుడు జరిగెనో నిర్ణయించుట కాధారములులేవు గాని దానిని పేర్కొను అనుమకొండ శాసనము క్రీ. శ. 1162 నాటిది. ఈ పట్టణము కాకతి రుద్రమదేవినాటి కున్నట్లు నాగ మహేశ్వర మందలి కరణం రామయ్యగారి శాసనమువలన దెలియును అది క్రీ.శ. 1280 నాటిది. ఇందిది నాయంకరమైనట్లు దీనిని బండారు మహాదేవుడు పాలించుచున్నట్లు తెలియును.

చంద్రికా పరిణయ కర్తయగు సురభి మాధవరాయలు తమ వంశమునకు

"అగ్నిసాక్షి పుత్ర సురభి పరాలి సురభి-సుగుణవర్ష పకాం దైక సురభి-కీర్తిపుర సురభి శౌర్యసురభి నా సింగనృపతి-పరగ దద్వంశమును గాంచె సురభి సంజ"

అమరసార ప్రసుధాకరకర్తయగు సింగభూపాలు మూలముగా జెప్పెను అతనికి మూలపురుషుడు అసిరి వరుల సింగమనాయడు, అతడు భేతాళ నాయనిని వైద్యవరముపాదు కనుక నీ వంశీయులు చేతరెడ కాలమువలన సురభిని విడిచి రేచర్లకు వెళ్ళి యచటనుండి మరల ప్రస్థాన మారంభించిరేమో యని తలపవలసి యున్నది.

సురభి నశించమైన పిమ్మట నచటి ప్రజలు నేటి కారువంగ-పులిజాల, నడిగడ్డ, లాళ్ళపల్లి-రఘులిపేట యను గ్రామ

ములను స్థాపించుకొనిరి. వీనియందు రఘుపతిపేట సురభికరణమగు రఘుపతిచేత వెలసెనని చెప్పుదురు. అది దాదాపు రజాకారుద్యమము వరకు ఆ ప్రాంతమున పనివారలకేమి, సరకులకేమి సురభిపేరు నిలిపియే యుండెను. అచట కమ్మరి కుమ్మరి మేదరి మున్నగు పనివారందరు తమ వృత్తులందు సాటిలేని వారై యుండిరి. లగ్న నిశ్చయము జేసికొని బండిగట్టుకొని వెళ్ళిన పెండ్లికి కావలసిన సమస్తమైన సామగ్రి మేదరి పెట్టెలతో సహా దొరుకుచుండెను. కాని నేడది రవాణా సౌకర్యమునకు దూరమై వెన్నుడిరిగినది.

అయినను ఇప్పటికీ ప్రాంతమున రఘుపతిపేట నేతపనివారు బాగుగా పేరందియున్నారు. అటులే పురిజాలయందలి కుమ్మరులు ప్రత్యేక నైపుణ్యము గలవారు.

క్రీ. శ. 1966 నందు నాగపూరు నివాసియగు నాగము ప్రతాపరెడ్డి కంట్రాక్టరుగారు పురిజాల కారువంగల నడుమ నొక కుంట వేయించుచుండగా అపుడచట నొక పెద్ద చెలువు ఱాయి బయటపడెను. వారు దానిని పగులగొట్టి కుంట కుపయోగించిరి. బహుశా అచట బయటపడిన చెలువు కరణము రామయ శాసనమున పేర్కొనబడిన చెలువు గవచ్చును. అంతేగాక ఆ సందర్భము నందలి త్రవ్వకమున పెక్కు విధములైన పెంకులు బొమ్మల ముక్కలు బయట పడెనట! వానిలో సురక్షితముగానున్న యొక మట్టిబొమ్మను మేము జూచితిమి. దాని పనితనము కొండాపురము బొమ్మల కేమియు తీసిపోదు.

ప్రస్తుతము సురభియని ప్రజలు చెప్పుకొనుచోట అచటచట యిటుకలు చిన్న చిన్న దిబ్బలు గనిపించును. కనుక పురాతత్వ శాఖ వారిది యెప్పటికైనను త్రవ్వి పరిశోధింప వలసిన ప్రదేశము.

— శ్రీ కిశోర్ బాబు, శ్రీ అశోక్ బాబు.

## 'డబ్బూ–దస్కం'

పయిదానిలో 'దస్కం' విలాఏర్పడినదీ చర్చిస్తూ యం హెచ్. వి సుబ్బారావుగారు–దస్కం దస్తకంవల్ల వచ్చిందనీ, అది అప్పును సూచిస్తుందనీ, క్రమేణ అది 'అప్పు' అనే అర్థాన్ని కోల్పోయి 'డబ్బు' అనే అర్థంలో రూఢమై స్వతంత్ర ప్రతిపత్తి లేకుండా 'డబ్బు' అనే మాటప్రక్కన జంట పదంగా స్థిరపడి ఉండవచ్చునని కడచిన (ఆగస్టు 1975) 'భారతి' లో తెలిపి ఉన్నారు.

ఇలాటి జంట పదాలలో రెండవ పదం ఊతపదంగా జనుల వాడుకనుబట్టి ఏర్పడేదే గాని, ఏదో అర్థవంతంగా ఉన్నట్లు అనుకోలేము. 'రావణుడు–గీవణుడు, కుంభకర్ణుడు–గింభకర్ణుడు' అనే చోట్ల నిందార్థంలో గి-గీ లు వచ్చినట్లు చిన్నయసూరిగారు బాలవ్యాకరణంలో సూత్రీకరించారు. కాని నిందలేని చోట్ల–అంటే 'బియ్యం గియ్యం, జబ్బు-గిబ్బు' మున్నగు స్థలాల్లో నింద కానరాదు. 'గిబ్బు'కు ఉన్న అర్థాలు ఎక్కడా కుదరవు కూడా.

ఇలాగే 'మాటా–మంతి' అనే చోట 'మంతి'కి అర్థం వెతకడంవల్ల ప్రయోజనం వుండదు. 'చింత–చింత' అనే జంట పదంలో అంధత్వాన్ని తెలిపే 'చింత' ప్రసక్తానికి సరిపడదు. ఇలాంటి జంట పదాలు మన వాడుకలో లెక్కలేనన్ని కానవస్తాయి చాలా పదాలు నిఘంటువులలో కూడా దొరకవు. దొరికినా వాటికి ఇచ్చే అర్థం వస్తుతానికి అతకదు.

దీనివల్ల మనం గ్రహించవలసిన దేమంటే-ఇట్టి జంట పదాలలోని ఊత పదాలు కొన్ని చోట్ల ముందువెనుకలు లవుతూ ఉంటాయి. జని వాడుకవల్ల ఏర్పడినవేగాని ఏదో అర్థయుక్తంగా ఏర్పడినట్లు తోచదు. వాటికి అర్థం నిర్ణయించే ప్రయత్నంవల్ల ఎక్కువ ప్రయోజనం ఉండదేమో అని తోస్తూ ఉన్నది.

— "అంగీరస"

## తెలుగునవలపై చైనా దాడి ప్రభావం 'బంగారు నడచిన బాట'

సెప్టెంబరు నెల భారతిలో "గంధ విమర్శలు" శీర్షిక క్రింద 'తెలుగు నవలా సాహిత్యము' అన్న గ్రంథాన్ని విమర్శిస్తూ శ్రీ రాప మోహన్‌గారు ఒకచోట యిలా అన్నారు. "... ... 1962 లో జరిగిన ఇండియాపై చైనాదాడి. 1965లో పాకిస్తాన్ ఇండియాపై యుద్ధం, 1971 లో బంగ్లాదేశ్‌పై పాకిస్తాన్ పోరాటం మున్నగునవి తెలుగు నవలలపై ప్రభావాన్ని చూపలేదు. అయితే పరిస్థితులకు కవులు ఉద్రేక పూరితులై కవితలు సృష్టించారు."

1965, 1971 నాటి విషయాలు ఏమోగానీ, 1962 లోని ఇండియాపై చైనాదాడి ఇతివృత్తంగా, ఆనాటి రాజకీయ వాతావరణాన్ని యథాతథంగా చిత్రిస్తూ, నవలాప్రక్రియ ముక్కు

లోకుండా, సాహిత్య గౌరవం దెబ్బతినకుండా, ఎంతో ప్రజ్ఞా ప్రాభవాలతో వ్రాయబడిన ఒక ప్రశస్త నవల ప్రముఖ సాహిత్య పరిశీలకులైన శ్రీ రామమోహన్‌గారి దృష్టికి ఎందుకు రాలేకపోయిందో చిత్రంగావుంది. శ్రీ ఆలువకొలను సదానంద వ్రాసిన ఆ నవల "బంగారునడచినబాట" అనేపేరుతో ఆంధ్రపత్రిక వార పత్రికలో 1964 లో ధారావాహికంగా ప్రచురింపబడింది అటు తరువాత పుస్తకరూపంలో వెలువడి. తెలుగులో ఉత్తమ గ్రంథంగా కేంద్ర ప్రభుత్వంవారి వేయిరూపాయల బహుమతిని పొందిందికూడా. బాలల కోసం వ్రాయబడిన ఉత్తమ పుస్తకాలకు నిర్దేశించిన ఈ బహుమతి ఒక సాహిత్య గ్రంథానికి రావడం అరుదైన విషయం. బహుమతి పొందినంత మాత్రంలో ఒక పుస్తకము ఉత్తమమైనదిగా వుంటుందనికాదు నా ఉద్దేశం

చైనా దురాక్రమణ తెలుగు నవలలపై ప్రభావాన్ని చూపలేదనడం సబబుగాదు. చైనా దాడిని ఆలంబనంగా చేసికొని మరి యితర నవల లేవయినా వెలువడి యుండకపోవచ్చుగాక, అలా వెలువడిన ఒకే ఒక నవల మాత్రం (పిల్లల నవల అయితేనేం లమేమి? పెద్దల నవల అనుకొన్నా దాని వైశిష్ట్యానికి లోపంరాదు.) 'బంగారు నడచినబాట' అవుతుంది దీనిపైన వున్నది పూర్తిగా చైనా దురాక్రమణ ప్రభావమే మన వైదేశిక విధానం, అహింసాసిద్ధాంతం శాంతి కాముకత్వం, పంచశీల, చైనా దురాక్రమణ. పాకిస్తాన్ కుటిలత్వం, టిబెట్ దైన్యస్థితి సూటిగా కాకుండా చాటుగా, పాత్రలుగా ప్రాణం పోసుకున్న ఈ నవల ప్రసన్న కథాకలితార్థ యుక్తితో, సునిశిత వ్యంగ్య వైభవంతో, నీతి ప్రబోధాత్మకమై. సరళ సుందర శిల్పాన్ని సంతరించుకొన్నది. ఆరోజుల్లో చైనాను నిరసిస్తూ, భారత్‌ను సమర్థిస్తూ వెలువడిన కొన్ని యితర రచనలవలె కేవల ప్రచారాత్మకంమైనదిగాకాక, ఈనవల అలంకాన స్థాయిమైన సాహిత్య గ్రంథంగా మాత్రమే దర్శనమిచ్చింది పరిమాణంలో చిన్నదే అయినా సర్వదేశాలకు, సర్వ భాషలకు, సర్వకాలాలకు ఆదరణార్హమైనదీ, తెలుగు జాతి గర్వించదగినదీ అయిన ఈ నవలకు సరియైన గుర్తింపు రాకపోవడం తెలుగు సాహిత్యపు దురదృష్టం. ఇటువంటి దురదృష్టాలు ఆంధ్ర భారతిక క్రొత్త వేమికావు ఇటువంటి నవల సద్విమర్శకులైన శ్రీ రామమోహన్‌గారి దృష్టికి రాకపోవడం శోచనీయమే!

— శ్రీ బి శ్రీనివాసులు రెడ్డి.

## బాలవ్యాకరణము - త్రిలింగలక్షణశేషము

1975 ఏప్రియల్ 'భారతి' లో శ్రీ నాగళ్ల గురుప్రసాదరావుగారు "బాలవ్యాకరణము- త్రిలింగలక్షణశేషము" అను శీర్షికతో నొక వ్యాసమును ప్రకటించిరి శ్రీ పారకోట రాధాకృష్ణమూర్తిగారు జూన్ సంచిక 'కలగూరగంప' శీర్షికలో శ్రీ ప్రసాదరావుగారి వ్యాసమును విమర్శించుటయు, దానికి వారు సెప్టెంబరు సంచికలో సమాధానము నొసగుటయు జరిగినది

శ్రీ ప్రసాదరావుగారు తమ వ్యాసోద్దేశమును నిట్లు పేర్కొనిరి "సూరికి దెలిసిన కొన్ని లక్షణములను త్రిలింగలక్షణ శేషమున నున్నవి సూరి రచించిన నిఘంటువు నందలి కొన్ని వివరణ వాక్యములను ... ... సూక్ష్మముగా బరిశీలించినచో సీతారామాచార్యులుగారు గురువులకెల్ల బుణపడిరో స్ఫుటికస్పష్టము ఆ విశేషములను దెలియ జేయుటయే నా సంకల్పము ... ...సీతారామాచార్యుల వారి సూత్రములను జూపి ఆ లక్షణములు చిన్నయసూరికి దెలియునని ఋజువుచేయుదును' ఈ ప్రణాళికానుసారముగ వారు ఏడు స్థలములను సాక్ష్యముగ జూపిరి తరువాత "అనేక కర్తృక క్రియకు సమీప కర్త లింగవచనంబు లగును' అను నాచార్యులవారి సూత్రమును గ్రహించి 'ఆచార్యులుగారు చెప్పిన లక్షణము నిత్యవిధి గాదనియు, దానిలో మార్పులు వచ్చుననియు దోచుచున్నది' అని వ్యాసమును ముగించిరి. దీనింబరిశీలింప శ్రీ ప్రసాదరావుగారి వ్యాసోద్దేశము లోపము పేర్కొన్నదేగాక, ఆచార్యులవారి దోషముల నిరూపించుటయును గూడ నని తోచుచున్నది

చిన్నయసూరికి దెలియని లక్షణములను నేను చెప్పుచుంటినని త్రిలింగ లక్షణ శేషమున నాచార్యులవారెచ్చటను జెప్పలేదు. సూరి బాలవ్యాకరణమున జెప్పక విడిచిన లక్షణములను వారు చెప్పిరి. "త్రిలింగ లక్షణ శేషము" అను పేరిట ఉచితత్వము నిదియేగదా! ఆచార్యులవారు చెప్పిన లక్షణములు సూరిగారికి దెలియవని యెవరైన వాదిరా? అట్లెవ్వరైన నూహింతురా! ఐనను విషయమును విశదపరచుటయే ప్రసాదరావుగారి లక్ష్యమని యూహించిన మరి వ్యాసాంతమున ఆచార్యులవారి దోషముల జూపుట యెందులకు?

ఇవి యంతయుఁ బరిశీలింప వ్యాసకర్త యాశయము ఆచార్యులవారిని దుయ్యబట్టుటయే యని స్పష్టమగుచున్నది. ఈ యభిప్రాయము వారి వ్యాసమందంతటను ధ్వనితవ్యంగ్యమగుచున్నది.

మఱియు శ్రీ ప్రసాదరావుగారు చూపిన సాక్ష్యములలో నొకటిరెండు సవరణలు నాకుఁదోచుచున్నవి.

1 సూరిగారు "శకటరేఫము తత్సమతద్భవములందు లేదు" అని బాలవ్యాకరణమున వ్రాసియు నిఘంటు రచనా కాలమునాటికి తద్భవములందును నలఘురేఫము కనబడుచున్నదని యంగీకరించెనని వ్యాసకర్త పేర్కొనిరి. అహోబల పండితులు తద్భవములందు శకటరేఫము గలదని వక్కాణించియుండెనుగదా! బాలవ్యాకరణమున సూరిగారు దానినేలకాదనిరి? మరల నిఘంటుకాలమునాటికి తమ యభిప్రాయమునేల మార్చుకొనిరి? ఇది సమర్థము నొప్పని విషయముగా నున్నదే! ఈ విషయమును శ్రీ ప్రసాదరావుగారాలోచింపరైరి. "వ్యాకరణ తత్త్వము నాకళించుకొన్న సూరి రచనా వ్యాసంగమున చరమ సృష్టి బాలవ్యాకరణము" అను ప్రసాదరావుగారి వాక్యమునకు స్వవచో వ్యాఘాతము కలుగునేమో!

2. పేట విషయము : పేట శబ్దము వైకృతమని ప్రౌఢ వ్యాకర్త. పేట శబ్దము దేశ్యమని సూరిగారు. ఈ విషయమున వీరి వురికిని నెట్టి యభిప్రాయ భేదమును లేదు. "బహుజనపల్లి వారీ సబిందుక నిర్బిందుక భేదము నేల గుర్తింపరో తెలియదు" అని వ్యాసకర్త పేర్కొనుట శోచనీయము. సబిందుక నిర్బిందుక భేదమును గుర్తించుటచేతనే ఆచార్యులవారు (సబిందుక) పేట శబ్దము వైకృతమని పేర్కొనుట జరిగినది. సూరి రి వాక్యమును ఆచార్యుల వారు సవరించిరని యూహించుట ప్రమాదికము.

ఇక ప్రౌఢ వ్యాకరణమునందలి దోషములనెత్తి చూపిన వ్యాసకర్త బాలవ్యాకరణమున గల దోషములనేల విడువరైరి? విమర్శనమున పక్షపాత వైఖరి సరిగాదు.

— శ్రీ మద్దిపట్ల సుబ్రహ్మణ్యశర్మ.

# లేఖ

## గ్రంథ సమీక్ష : సందేహములు

అయ్యా,

అక్టోబరు భారతిలో "శిథిలాలయ" గ్రంథసమీక్షను చదివాను. ఈ మధ్యనే ఈ కావ్యాన్ని చదవటం తటస్థపడింది.

శ్రీ బులుసు వేంకటరమణయ్య గారు పై శిథిలాలయములో చమత్కృతి లేదని వ్రాసారు. సమీక్షకులు విప్పుచున్న కావ్యంలో వున్న వాటిని గురించి చర్చించాలిగాని. లేనివాటిని ప్రస్తావన చెయ్యటం ఎందుకు?

పీఠికలు వ్రాసిన ఇద్దరు పండితులు స్పృశించని రత్నాలు ఎన్నో ఉన్నాయి కావ్యంలో. వాటిని చూపకుండా అల్తినాటి 'త్రిలింగ' శబ్దాలు అసహజంగా, అసందర్భముగ వున్నవని వ్రాశారు. సమీక్షకునికి అసహజంగా ఉండవచ్చునేమోగాని అసందర్భంగా ఎలా వున్నవో అర్థంకాలేదు! కేవలం పీఠికలమీదనే ఆధారపడ సమీక్ష వ్రాసినట్లున్నది. హస్తినాపుర చరిత్ర గల తెలుగు దైవానికి ముడివడి యున్నదన్న విషయం కవిస్పష్టముగా తెలిపియున్న విషయాన్ని ఎందుకు ఆరా తీయరాదు. వాటిని వదిలిపెట్టియున్నారు. శాతవాహనుల కాలమునాటికే కవి చెప్పిన త్రిలింగాలకు తెలుగు భూభాగం విస్తరించి యున్నట్లు చరిత్ర చెబుతున్నది గదా! ముక్కంటి సేన తెలుగు రాజుల భూభాగం ఆనాడు అలా ఏల ఖండియుండరాదు. ఆంధ్రాభిమానంతో కవి ఉద్దేశమేమిటో చివరి రెండు (కథలోని) పద్యాలలో చెప్పబడియున్నది. కేవలం తెలుగు వారిలో సమైక్యతా భావాన్ని చాటి చెప్పే కావ్యమిది. ఆంధ్రరాష్ట్రంవచ్చి 22 సంవత్సరాలైనను ఇతర రాష్ట్ర, దేశ లైబ్రరీలలో మూలుగుచున్న తెలుగు వ్రాత ప్రతులను గురించి, మన గత చరిత్రకు మూలాధారములు గురించి ఎవ్వరూ ఏమీ పట్టించుకున్నట్లు లేదు. ఇకమీదనైనను పరిశీలించిరే చాల బాగుండును.

— శ్రీ పోటు వెంకట కృష్ణశాస్త్రి

# గ్రంథ విమర్శలు

## వెలిగే మిన్నులు

[పద్యగీత వచన కవితా సంపుటి. కర్త- ప్రత్యూష: 1/8 డెమ్మీ 100 పేజీలు (ప్రవేశికతో కలిపి) వెల: రు. 5...50 ప్రతులు దొరికేచోటు: శ్రీ వేంకటేశ్వర బుక్ డిపో; కొత్తగూడెం; ఖమ్మంజిల్లా.]

ఈ కవి ప్రత్యూష కాబట్టి పుస్తకంపేరు వెలిగే మిన్నులు కావడం ఒక సొరస్యం. ముందు చరుపులో కవితా పథంలో ముందుకు సాగిపోయ్యే యువకవులకు-ఏకలవ్యులకు ఏమి లాగని (అంగంగా అర్థంగా) ద్రోణాచార్యుడుగా సోమసుందర్‌గారు పిఠాపురంనుండే దారి చూపుతున్నారు. సోమసుందరం పండితుడు, విమర్శకుడు; తూర్పు పడమటల సాహిత్యాలు వడబోసి వ్రాసిరేచిన ఆధునికాశయపూర్ణుడు. వీరి, శిష్యుడో మిత్రుడో- ప్రత్యూష కవిత్వాన్ని ఒక ఒరవువేసి వన్నె చూసి, దానికి ప్రవేశికలో విషయపూర్ణ వ్యాఖ్యానం చేసినారు. కవితా గుణాలను గూర్చి చేసిన దీర్ఘచర్చ కారణ విమర్శకపూర్వకమైనది. కవిత్వం పుట్టు సొమ్మేగాని పెట్టు సొమ్ముకాదంటూ, పఠనాలవల్ల కవి హృదయం సంస్కారవంతమవుతుంది-అంతమాత్రమే అంటాడు. ఇది మంచి విసరే కట్టమంచి రామలింగారెడ్డి దీనినే "నిఘంటువులు వలె వేయుట నూనెకు నష్టమేగాని కవితకు పుష్టిలేదు" అన్నారు. కవులు కావాలనే తాపత్రయంతో వ్రాసేవారికి చేతివ్రాత బాగా కుదురుతుందంటూ, ఇది అనుకొన్న విషయాన్ని చదివిన వారికి రసస్ఫూర్తి కలిగించలేని వ్రాయన గాండ్రసంగతి అంటాడు-సోమసుందర్. పరాసుకవి-వాల్టేర్ "కవిహృదయం రెక్కలు లేపనంటిది; అది లోతులోకి యీదగలదు, పైన ఎత్తుగా ఎగరగలదు" అన్న రహస్యవాక్యానికి వివరణగా" మన గుండెల్ని మీటే రేపటి అనుసుల కోసం సుషుమ్నచైతన్యాన్ని నేడే పల్లవిస్తున్నాడు" అని కవిత్వ నిర్వచనం సోపపత్తికంగా చేసినాడు. ఆంధ్రవిశ్వవిద్యాలయం ఇప్పుడు పేరిగాడి రాజ్యంలో (ప్రతాపరుద్రీయనాటకంలో అప్పలపలితిప్పి రాణైన చాకలి) కళాప్రపూర్ణ బిరుదాన్నిగా లవి పోగవేయడాన్ని గురించి మంచి దెబ్బకొట్టింది- యీ ప్రవేశిక. ఈ కళాప్రపూర్ణ బిరుదం మొదట పేరిగాడి పాత్రను సృష్టించిన ఆ వేదము వేంకటరాయశాస్త్రికిగానే కట్టమంచివారు సృష్టించినారు. ఇప్పుడు నీటికంటె పలుచనై పోయిందని యీయన వగపు.

ఇంతగా సోమసుందర్‌గారిని గూర్చి చెప్పింది ఎందుకంటే- యిదంతా యిప్పుడు అనుశీలనానికి స్వాతీకరింపబడిన పుస్తకం సంగతి.

ఇక యీ కవి, ఆయన కవిత్వాన్ని గురించి- ప్రత్యూష గరచన కవితాశిల్ప కోరకాలను నిలువెలా తొడుక్కొని ఉన్నది. ఈ గుణానికి ప్రాణం పోసింది సోయగపు తెనుగుపదాలు, సంస్కృతరీతుల చారు గంభీరత. భావాలకు తగిన భాష ధార యీ కవితకు సహజాలంకారాలు. పురుషుడు లేకుండా సూటిగా చెప్పినాడు. "తూరుపు కన్నె కపోల పాళికలు అరుణ రాగరంజిత మవుతున్నాయి" తూర్పు రేకలు పైలవిడినవి-అని మా పాటకజనం అదే నుడికారంలో ఎంతరమ్యత ఉందో అంతే సొబగు యీ వర్ణనలో ఉన్నది. "ఇరుల పీయూకం, పుష్పమ దినం" "ఎడతెగని ఇడుపుల వేడి నిట్టూర్పులు" 'మోడుబారిన బ్రతుకు తరువుల గోడు" "మసగడ నుదుటిపై ఇది కుంకుమబొట్టు" మొదలైనవి తెనుగు నుడులు. సంస్కృతపక్కి:-"మధురపక్వ (సం) ఫలపుష్ప ప్రపూత చారుతర తరులతా నికుంజ మంజుల పుణ్యనదీ నదపూర్ణ మహిత చరిత నా భరతమాత" "వారు కాంద్రభములు" "అక్కడిక్షితి జాంచలం."

ఎక ఉద్రేకంల సుకుమార సౌభాగ్య శ్రీచందనం గ్రంథమంతా అలుముకొని పోయున్నది:- విరులపత్ర శిరోజాలో తురిమి చెటు కన్నె; పోటి చెటు న పూసిన చుక్కలపూవులో కి; తారకలు నింగి కడలిలో మీనాలు; హేమంతం ధూళకన్నెల శిరాల తురిమిన మంచు బొట్టలు; బంగారు నుడూయి శిరంనిండా తురిమి విరగబడి నవ్వుతున్నాయి నవ రేజిగురు జొంపాలు-మొదలైనవి.

నేటి కాలాన్ని తలపోసి నిరాశాపహతుడు గాక ఆశామయ ప్రత్యూషానికి ఎదురుచూస్తున్నాడు. నేటి రాజకీయ కలుష వాతావరణాన్ని కడిగిపోలేడు ఈ సిలికి శోకించినాడేగాని శపించడు యీ కవి. ఈ ఉక్కిరి (ఊబి) నుండి బయటబడే మార్గం గూడ చూపించగలిగే కవనవాది అయినాడు. ఈయన స్నేహశీలి, కాబట్టే ఎందరో మిత్రుల నేర్పుకొన్నాడు. అందని వాటికి అర్రులు చాచక

విహిత నీరాజనవిధాన్;
ఇయం జ్యోత్స్నా కాపి
స్రవదమృత సందోహసరసా
మమోద్యద్ధారిద్ర్యజ్వర
తరుణతాపం తిరయతు. [లక్ష్మీలహరి]

అనువాదం —

'నీదు ముఖాబ్జమందుఁ గను
నియమునఁ జిర్నగవిచ్చు దంతముల్
మేదుర హీర దీధితుల
మేలిమిఁదాలిచి వేల్పు బువ్వతో
పాదము లాడు స్వాదు తల
వన్నెపుఁ దెచ్చిన పండువెన్నెలల్
నాదు దరిద్రతాజ్వరవి
నాశకరంబులుగా రహించుతన్.

మూలం — కరుణాలహరి చివరిశ్లోకం —

సురస్రోతస్విన్యాః
పులిన మధి తిష్ఠన్నయనయోః
విధాయాంతర్ముద్రా
మథ సపది విద్రావ్య విషయాన్,
విధూతాంతర్ధ్వాంతో
మధుర మధు రాయాం చితికదా
నిమగ్నస్స్యాం కస్యాం
చన నవనభస్యాంబుదరుచి,

అనువాదం—

ఎన్నటి కేను గాంగతట
మెక్కి మదంతరయోగ ముద్రలో
గన్నుల నిల్పి దుర్విషయ
కాండము ద్రోచి, హృదంబుజాంతరో
ద్యన్నతమంబు పోవ రుచి
భాద్రపదాంబుద రమ్యరోచిరు
ద్యన్నవమౌ నితాంతమధు
రాకృతిమగ్నుఁడనై వెలుంగుదున్.

వ్యాకరణ విద్యాప్రవీణ, భాషాప్రవీణ, వేదాంతపారీణ శ్రీ గంటి-నీలకంఠశాస్త్రిగారు దీని ప్రశస్తిని వెల్లడిస్తూ కూర్చిన 'ఆశాసనము' దీనికి మెరుగు పెడుతున్నది.

పండితరాయల రచనలకు ఉన్న ప్రశస్తమైన అనువాదాలలో ఇది ఒకటి అని చెప్పవలసి ఉన్నది.

# మా సీమ కవులు

[రచన : శ్రీ జానమద్ది – హనుమచ్ఛాస్త్రి, డెమ్మీ సైజు 208 పుటలు. వెల రూ. 6 లు. ప్రచురణ 'మా సీమ పబ్లికేషన్స్, 17/38. వై. వి. స్ట్రీట్, కడప. ప్రతులకు ప్రచురణ కర్తలకే వ్రాయవలెను.]

ఆంధ్రప్రదేశ్‌లోని వివిధప్రాంతాలలో ఎందరో కవులు, పండితులు, రచయితలు ఉన్నారు. అందులో కొందరిని గురించి కొందరికి మాత్రమే తెలుస్తున్నది. ఆ యా ప్రాంతాలలో ఉన్నవారిని పరిచయం చెయ్యడానికి ఒక దశాబ్దానికి ముందే జిల్లా రచయితల సంఘాలు బయలుదేరి తమ తమ ప్రాంతాల రచయితల సంగ్రహ చరిత్రలను తెలిపే సంపుటాలను ప్రకటించడం మొదలు పెట్టాయి. అందులో మొదట చిత్తూరు జిల్లాయే మార్గదర్శకం అయిందనుకుంటాను. జిల్లా సంఘాలే కాకుండా ప్రాంతీయ సంఘాలున్నూ ఏర్పడ్డాయి. అందులో రాయలసీమ రచయితలను గురించి కల్లూరి-అహోబలరావుగారొక గ్రంథాన్ని ప్రచురించారు. అందులో ఉన్నట్లు ఇందు రచయితల ఛాయాచిత్రాలు లేవు. ఇది 'రాయలసీమ రచయితల చరిత్ర'కంటె ముందు వెలువడిన గ్రంథం. అంతకంటె విపులమైనది.

'రాయలసీమలోని కవులు మరుగునపడిన మాణిక్యా'లని అంటున్నారు. కాని, అందరూ మరుగుపడి ఉండలేదు. వావికొలనువారు, ధర్మవరం వారివంటి విఖ్యాతులూ ఉన్నారు. మరుగుపడిపోయినవారు అన్ని ప్రాంతాలలోనూ ఉన్నారు. పరిశ్రమించి, వారిని గురించి తెలుసుకుని లోకానికి వెల్లడి చెయ్యవలసిన అవసరం ఎంతైనా ఉంది. ఇది ఒక్కరివల్ల అయ్యేపని కాదు. అన్ని ప్రాంతాలవారూ దీనికి పూనుకోవాలి. రచయిత తమ ప్రాంతంలో వారిని గురించి తెలుపుటకు పూనుకోవడం మిక్కిలి హర్షింపదగినది.

శ్రీ హనుమచ్ఛాస్త్రిగారు మొదట 'మా సీమ' అనే పత్రికలో ఈ కవులను గురించి వ్యాసాలు ప్రారంభించారు. తర్వాత ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, తెలుగు విద్యార్థి మున్నగు పత్రికలలోనూ కొన్నిటిని ప్రకటించారు. వీటిలో ముప్ఫైనంది కవులను గురించిన వ్యాసాలను ఈ పుస్తకరూపంగా 'మా సీమ' పత్రికా సంపాదకులు ప్రకటించారు.

ఇందలి కవులు కొందరితో రచయితకు ప్రత్యక్ష పరిచయం ఉంది. కొందరి రచనలతోనూ తమకే పరిచయముంటున్నది హనుమచ్ఛాస్త్రిగారు ఎంతో శ్రమించి ఆయా కవులనుగురించిన విషయాన్ని సేకరించి ఈ గ్రంథాన్ని రచించారు.

"ఈ వ్యాసములు ఆయా కవులగురించికాని, వారి రచనల గురించి కాని సమగ్ర సమీక్షయుకావు. పరిచయాత్మకాలు మాత్రమే!' అని చెప్పడం రచయిత వినయాన్ని వెల్లడిస్తున్నది. క్రమనిర్ణయంలో పాటించబడలేదు. అయినా–కొందరు గత శతాబ్ది చివరిభాగంలో జన్మించినా, ఈ శతాబ్దిలో ఉన్నవారే కనుక అందరూ ఇరువదవ శతాబ్దికి చెందినవారే అని చెప్పుట ఉచితంగానే ఉన్నది.

ఇందు గ్రహించబడిన కవులలో సుప్రసిద్ధులు వావిలికొలను వారు, జనమంచివారు, ఆంధ్రనాటక పితామహులు, కోలాచలంవారు, సి. ఆర్. రెడ్డి గారు, గాడిచర్లవారు, రాళ్ళపల్లివారు, దుర్భాకవారు, గడియారంవారు, వెంకటకృష్ణశర్మగారు, పుట్టపర్తివారు, కల్లూరి వారు, బెళ్లూరివారు, పద్మలపర్తివారు, సుబ్బన్న శతావధానిగారు ఉన్నారు. వీరిని గురించి కొంత కొంత తెలిసినా, వీరి సమగ్రచరిత తెలిసినవారు అరుదు. మిగిలినవారిని గూర్చి చాలామందికి తెలియదు. వీ రందరినిగురించీ ఇందులో విపులంగానే చెప్పబడినది. మండల రచయితలను గురించిన సంపుటాలకంటె ఇట్టి గ్రంథాలు ప్రజానీకాన్ని ఎక్కువ ఆకర్షించగలవు.

'మా సీమకవులు' కవిచరిత్రగ్రంథాలలో ఎన్నదగినది. ఎంతో పరిశ్రమించి, ఓపికపట్టి దీన్ని రచించిన హనుమచ్ఛాస్త్రిగారు చక్కగా ముద్రింపించి ప్రకటించిన ప్రకాశకులు అభినందనీయులు.

—శ్రీ బులుసు వేంకటరమణయ్య

## TYAGOPANISHAD
## (త్యాగోపనిషద్)

(గ్రంథకర్త: శ్రీ కె. ఎస్. పురుషోత్తమన్, వెల: రు 20/ ఆంధ్రప్రదేశ సంగీత నాటక అకాడమీ ప్రచురణ, కళాభవన్, సైఫాబాద్, హైదరాబాద్ 4)

ఈ గ్రంథమున శ్రీ కె. ఎస్. పురుషోత్తమన్‌గారు శ్రీ త్యాగయ్యగారు రచించిన వేలకొలది సంఖ్యగల కృతులలో 125 కృతులకు సాహిత్యమును మూలము తెలుగు లిపిలో తెలిపి ఆ సాహిత్యమునకు ఇంగ్లీషున అర్థములను విపులముగా ఇచ్చియున్నారు.

శ్రీ త్యాగయ్యగారిని సంగీతజ్ఞులు నారదాంశ సంభూతులనియు లేక ఆ నారదావతారమనియే కొనియాడుదురు. శ్రీ త్యాగయ్యగారు సంగీత త్రిమూర్తుల వరుసలో ముఖ్యస్థుడైన కీర్తివంతుడు. వీరి సాహిత్యములకు ఈడుగా ఏ ఇతర వాగ్గేయకారులును రచియింప లేదనియు, రచియింపలేదనియు కూడ నమ్మబడుచున్నది. ఇతర వాగ్గేయకారులు తమ సాహిత్యములను ఉత్తమ భక్తిరసభావము గలవిగా దైవస్తుతిగను, కొందరు వాటిలో దైవస్థల పురాణాది విషయములను కొంచెము చేర్చియు రచించియుండుట మనం ఎరుగుదుము

శ్రీ త్యాగయ్యగారు తమ బాల్యముననే రామదాసుల అనేక కీర్తనలను వినియు నేర్చియు గొప్ప రామభక్తులైరి. వారు తమ దైవమును శ్రీరామచంద్రుని స్వరూపముగానే తలంచిరి. వారు కృతులను రచించుటకు ప్రారంభించినపుడు రామదాసులవారి కీర్తన సాహిత్యముల శైలిగానే తమ సాహిత్యములను వ్రాసిరి. ఇట్లు తమ సాహిత్యములను రామభక్తి రసపూరితము గలవిగా రచించినను వాటిలో వేదాంత, ఇతిహాస, పురాణ, లోకానుభవముల సామెతలతో గలబడు అనేక ధర్మరహస్యముల ( = ఉపనిషద్) విశేషాంశములను మిక్కుటముగాను చాలా విపులముగాను కనపరచియున్నారు. ఈ విశేషాంశములన్నిటిని చక్కగా పరిశీలించి వాటికి సంబంధించిన అనే

గ్రంథములోని సంక్షిప్త వివరములను ఎక్కువ విశదపడి పూర్తిగా విమర్శనములలోనూ శ్రీ పురుషోత్తమన్‌గారు ఈ గ్రంథము వ్రాసి యున్నారు.

ఈ కాలమున గాయకులు అనేకులు కృతుల సాహిత్యములలోని పదములను శుద్ధముగా ఉచ్చరింప లేనివారుగా నున్నారు. కొందరు వాటి అర్థభావములను బొత్తిగా తెలియకయే పాడుట చూచుచున్నాము. వారు ఉత్త అభ్యాసబలము మాత్రమే. అనగా తమ ఇంపు శారీరమున చక్కగా కృతుల సాహిత్యములను వాటికి అమర్చిన రాగభావములో పాడుదురు. వారిలో అనేకులు సాహిత్యమునకు అర్థము తెలిసి యుండుట అవసరమని కూడా ఎంచెదరు. కొందరు అక్షరశుద్ధియు సాహిత్యార్థములను నేర్చుకొన లేకున్నారు. అటువంటి గాయకులకు ఈ ప్రచురణము ఎక్కు ఉపయోగపడుననుట నిశ్చయము.

సంగీతజ్ఞులకును గాయకులకును కృతుల సాహిత్య పదార్థములను, వాటి విశేషాంశములను తెలుపుసేవ మొదలు మొదలుగా చేసిన వారు శ్రీ కె. వి. శ్రీనివాసయ్యంగారు తమ 1922లో "త్యాగరాజహృదయము" అనే గ్రంథము మూలముగా. ఈ "త్యాగరాజహృదయము" మూడు భాగములుగా ఒక్కొక్క భాగములో 75 కృతులను మొత్తము 225 కృతులనుగా నిచ్చిరి. అయితే గ్రంథము పూర్తిగాలేదు. మరొక (నాల్గవ) భాగము వ్రాయబడకపోయినది. శ్రీ పురుషోత్తమన్‌గారు ఈ "త్యాగరాజహృదయము"లోని వివరములకన్న ఎక్కువగా ఒక్కొక్క కృతికిని విషయములను తెలిపి యున్నారు.

ఈ "త్యాగోపనిషద్" గ్రంథమున 125 కృతులు గాక ఇంకను మనకింతవరకు లభించి యుండు సుమారు 700 త్యాగయ్యగారి కృతుల కన్నిటికిని ఇట్లు విశదముగా విశేష పదార్థ భావ రసాంశములను శ్రీ పురుషోత్తమన్‌గారు ఇంకను కొన్ని గ్రంథభాగముల మూలముగా విశదపడి వ్రాసి ప్రచురించిన గాయకులకు పూర్తిగా ఉపయోగపడుట నిశ్చయము—అవశ్యము కూడా.

గాయకుడు తాను పాడు సాహిత్యముల అర్థభావమును తెలిసి అనుభవించి పాడిన వాటికి అమర్చియుండు రాగరస భావము ఎక్కువగా ప్రకాశించును. శ్రీ త్యాగయ్యగారు తమ "సొగసుగా మృదంగ తాళ" అను శ్రీరంజని రాగమున కృతిలో ఈ విషయము చక్కగా వివరించి యున్నారు. ఆ కృతి సాహిత్య అనుపల్లవి చివరలో "నిజవాక్కులతో స్వరశుద్ధముతో" అని సంగీతముయొక్క రెండు అంశములైన (1) నిజవాక్కు (= సాహిత్యశుద్ధము), (2) స్వరశుద్ధము (= స్వరశుద్ధమును రాగభావమును), అనగా మాటను ధాతును చాల ముఖ్యమైనవిగదా, మాతు (= సాహిత్యము) ధాతును ( =రాగభావము) అనుసరించియు, ధాతు మాతులోని నవరస సందర్భార్థములను ఎక్కువగా ప్రకాశింపజేయునట్టిదియునాను నుండవలెను. అట్టి కృతులను రచించువాడే ఉత్తమ వాగ్గేయకారుడని లక్షణజ్ఞులు వివరించియున్నారు.

శ్రీ పురుషోత్తమన్‌గారు (125) కృతుల సాహిత్యములను మాత్రము తెలుగు లిపిలో వ్రాసి, రక్కిన వివరములన్నిటిని కూడా తెలుగునందని వ్రాసియుండిన గాయకులకును, కృతులను నేర్చుకొను విద్యార్థులకును చాలా ఉపయోగముగ నుండియుండును. వీరు అతి శీఘ్రమున ఇంకొక ప్రతిని ఇంకను ఎక్కువ సంఖ్యల కృతులను గలిపిగా తెలుగున ప్రచురింతురని నా ప్రార్థన.

గ్రంథకర్త ఈ సాహిత్యములను శ్రీ విస్సా అప్పారావుగారి పాఠము అని చెప్పియున్నారు. ధృతస్థానం శ్రీ నరసింహభాగవతుల సాహిత్య పాఠములను శుద్ధమైనవి యని వినికి. ఈ రెండు పాఠములలో అనేకచోట్ల అక్షర, పదభేదములు కనబడుచున్నవి.

సురటి రాగములోని "గీతార్థము" కృతిలోవచ్చు "హరి" లను పదమునకు "కపి" అని అర్థము యివ్వబడియున్నది. హరివరుడు కపిశ్రేష్ఠుడు అగును. అప్పుడు కపివరరూపుడు అనిన అర్థమేమి? "కపిశ్రేష్ఠరూపుడగును" గదా. హరి అనగా సింహమని యొక అర్థముకూడ నున్నది. ఆ అర్థమునకు సరిగా "హరివరరూపుడు" అనిన సింహమువంటి రూపము గలవాడని గదా అర్థమగును. హరియన మహావిష్ణువు. విష్ణురూపుడనియు గ్రహింపదగును. వాతాత్మజుడన్న తర్వాత కపియనుట పునరుక్తి దోషముకాదా?

ఈ గ్రంథమునకు "త్యాగోపనిషద్" అని పేరివ్వబడి యున్నది. 1935లో వాలాజాపేట శ్రీ కె. కె. రామస్వామి భాగవతర్ వారు "శ్రీ త్యాగబ్రహ్మోపనిషద్" (మొదటి భాగము) అని ఒక గ్రంథము ప్రచురించిరి. ఆ గ్రంథమున శ్రీ త్యాగబ్రహ్మము వారి చరిత్ర సంగ్రహమును, తమ పెద్దలైన వాలాజాపేట వేంకటరమణ భాగవతులు, కృష్ణస్వామి భాగవతులను మరి ఇతరుల చరిత్రములను కొంచెము వ్రాసి గ్రంథము చివరలో 7 శ్రీ త్యాగయ్యగారి

కృతులను వాటి స్వరసాహిత్యములతో సహా యిచ్చియున్నారు. శ్రీ త్యాగయ్య గారి పేరు సంతకముకూడా, "త్యాగరాజ బ్రహ్మము" అనిగదా. వారి కుటుంబము వారందరును బ్రహ్మములే. గిరిరాజ బ్రహ్మము రామ బ్రహ్మము, ఇట్లు. కనుక ఈ గ్రంథమునకు "త్యాగరాజ బ్రహ్మోపనిషద్" అని పేరివ్వబడియుండిన ఇంకను పొందికగా నుండునని నా అభిప్రాయము.

మధ్యాది తాళమున అనేక కృతులున్నవి వాటిని కూడా దేశాది తాళమని వ్రాసి యున్నారు. ఈ భేదము ఎట్లు వచ్చినది. గ్రంథమున తప్పొప్పుల పట్టిక ఇచ్చి యుండుటసరియే. అయితే గ్రంథకర్త తానే ఒప్పుకొనియుండు గ్రంథమున ఇంగ్లీషున స్పెల్లు (spelling) తప్పులు ఏ ఒక విధిని అనుసరించక కనబడుచున్నవి. మరొక ప్రచురణలో నైనను ఈ spelling తప్పులనుకూడా సవరించి యిత్తురని నమ్మెద. గ్రంథమున ఇంగ్లీషు భాషలో వ్రాసియిచ్చియుండు వాటిని అంతయు తెలుగు పరచి మరొక గ్రంథమైనను వ్రాసి ప్రచురించిన గాయకులకును, విద్యార్థులకును, సంగీతజ్ఞులకును చాలా ఉపయోగపడునని నిశ్చయముగా చెప్పవచ్చును.

ముద్రించుటలో సిరా అంటని పుటలు చాల కలవు అచ్చాఫీసు వారి అశ్రద్ధ కాబోలు. పుటల పైనను పుట సంఖ్యయేకాక పేజి హెడ్డింగులేదు. ఉంచిన బాగుండును.

మొత్తముమీద చాలామందికి ఈ గ్రంథము తెలిసికొనుటలో చాల ఉపయోగపడుననుటకు సందేహములేదు.

— శ్రీ సరస్వతి రామకృష్ణయ్య

## అరవిందుని కవిత

(శ్రీ జి. వి. ఆర్. కృష్ణారావు. ప్రచురణ రచయిత. 4-7-167. ఇసామియాబజార్. హైదరాబాదు 500027. మూల్యము 6 రూ. లు).

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు 'అరవింద కవిత' అనే శీర్షికపై నిర్వహించిన పోటీలో బహుమతి నందిన గ్రంథమిది. దాదాపు అరవై సంపుటాల అరవింద కవితా మహోదధిన్ని స్ఫోరకంగా రచయిత మనకి 140 పుటల గ్రంథంలో పరిచయం చేశారు. అరవిందులు దివ్యయోగి. కాబట్టి ఆయన కవిత్వ ప్రస్థానం కేవల కవిత కాక ఆధ్యాత్మిక సాధనలో ఒక భాగంగా సాగిన కర్మయోగ ఫలంగా మనం భావించాలి.

అరవిందులు 1890 ప్రాంతంలో Songs to Mysrtilla అనే తొలికవితను వెలువరించారు. నాటినుండి "సావిత్రి" వరకుగల చిన్నా ఖండికలూ, దీర్ఘకావ్యాలూ బృహద్గ్రంథాలూ వచ్చాయి. వాటి నన్నిటినీ క్రమ పద్ధతి శ్రీ కృష్ణారావు మనకు పరిచయం చేశారు. ఇందులో మొత్తం ఎనిమిది అధ్యాయాలు ఉన్నాయి మొదట అరవిందుని జీవితం పరిచయంచేసి తర్వాత రచనలను విశ్లేషిస్తూ ఆంగ్ల ఖండికలను తెలుగు అనువాదాలు ఇస్తూ వెళ్ళారు ఇంత సమగ్రంగా అరవిందుని కవితను మనకు పరిచయంచేసిన తొలి తెలుగు గ్రంథం ఇదేనని చెప్పడానికి ఏమీ సందేహం లేదు.

అరవిందుని కవితకు ఆధ్యాత్మిక సిద్ధాంతం మూలాధారం. మహాపురుషావిర్భావం శివశక్తి "సావిత్రి" సారాంశం ఇదే. ఈ దృష్టితోనే మహర్షి ఊర్వశి పురూరవుల ప్రేమకథను — ప్రమద్వరల వృత్తాంతానికి వ్యాఖ్యానం చెప్పారు. మార్కండేయుని మీదా ధ్యానముద్రాంకితుడైన బుద్ధునిమీదా వారు చెప్పిన ఖండికలలోని ఆధ్యాత్మిక తాత్పర్యం ఇదే! మృత్యువుపై యుగయుగాలుగా మానవుడు జరిపే పోరాటం విజయం పొందుతుందని, అమర ప్రేమలో మానవుడు 'మృత్యుంజయుడు' అవుతున్నాడని, సృష్టికి సార్థక్యమూ, సాఫల్యమూ ఈ మృత్యుంజయత్వంలోనే వుందని అరవిందులు అన్నారు. శ్రీ కృష్ణారావు ఈ ప్రధానాంశం విస్పష్టంగా నొక్కి చెప్పవలసి వుంది!! అంతేకాక అరవిందుడు భౌతిక ప్రపంచం తుచ్ఛమైనదిగా భావించలేదు "పదార్థం నిగూఢమైన ఆత్మతేజాన్ని ప్రకటింపచేసే" అనేది అరవింద సిద్ధాంతం. ఇది ఉపనిషత్ ప్రవక్తలు చెప్పిన వేదాంత దర్శనాన్ని సమూలంగా మార్చి పోయింది అరవిందుడు పూర్ణయోగి. శంకరునివలె మిథ్యావాది కాడు. ఈ విషయం కృష్ణారావుగారు స్పష్టంగా చెపితే బాగుండేది. ముఖ్యంగా మొదటి పుటలోని మొదటి మూడు నాలుగు పంక్తులలో కృష్ణారావుగారు భౌతిక ప్రపంచమనేది బహుశః మున ... దానియందే ప్రసిద్ధమైన దానినంటక ముక్తిని బోధించిన అరవిందం

అరవిందులు అన్నారు. అరవిందుడు పదార్థంనుండే పరమార్థం వికసిస్తుందనీ పదార్థం పృథ్వీ భూమిక అని అన్నారు. అంటే పదార్థాన్ని అంటక ముట్టక జీవించమని మహర్షి చెప్పలేదు పదార్థం, పరమార్థం ఒకే నాణెముసు రెండు ముఖాలని అరవిందుల భావం. శ్రీ కృష్ణారావు అరవింద యోగాన్ని ఐదవ అధ్యాయంలో వివరించారు. అయితే (Tiger and the Deer) 'మార్కండేయ' (The Hero and the Nymph) (Love and Death) వంటి ఖండికల వ్యాఖ్యానంలో దీనిని విస్తరించవలసివుంది. ఖండిక ఇచ్చి అందలి ఛందస్సునూ, శబ్దాలంకారాలనుగూర్చి చెప్పడం అవసరమే కాని అరవిందుల ప్రత్యేక దర్శనం ఆ ఖండికలో ఎలా ప్రతిబింబించిందో 'పద్య విమర్శ' లో బాగా విపులీకరించడం అవసరం. శబ్దం కావ్య శరీరం. అలంకారాలు, వస్త్రాద్యలంకారాలు. మహా పురుష సిద్ధాంతం అరవిందుని కావ్యాత్మ. శరీరంకన్నా ఆత్మకే మనం ప్రాధాన్యం ఇవ్వాలి కదా!!

శ్రీ కృష్ణారావు విద్వాంసులు. సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో నిష్ణాతులు. తెలుగులో లోగడ ఎవరూ చేయని 'అరవింద కవితా పరిశీలన' వీరు చక్కగా చేశారు. ఇందుకు వారికి తెలుగువారు ఋణపడివుంటారు. అరవింద కవితలకు వారు యథామూలకమైన అనువాదాలుకూడా ఇచ్చారు. శబ్దానికి శబ్దం అనువాదం చేయడం మూలానికి ఇది చాలా సాన్నిహిత్యంగావుంది. స్వకపోల కల్పితభావానువాదాలకన్నా కృష్ణారావుగారి భాషానువాదమే ఒక రకంగా మిన్న ఎందుకంటే అరవిందుడే మనకిక్కడ కన్పడతాడు కదా!!

— "శివప్రసాద్."

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 75226.

KLVA104M127

Bc

మనము ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA104M127 |
| పుస్తకం పేరు | భారతి |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, BCI, |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | navya |
| స్కాన్ చేసినది | naveena |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |